# అమ్మా నాకూ కూడా!



**Duckback®**

గ్లేడ్జ్ గమ్‌బూట్స్—మగవారికి, పిల్లలకు మరియు చిన్నవారికి.



బెంగాల్ వాటర్‌ప్రూఫ్ లిమిటెడ్

కలకత్తా • బొంబాయి • మద్రాస్

సంరక్షణ కావాలి—Duckback® ఒక కుటుంబ వ్యవహారం

naa BWL-8475 TEL

ప్రవేశ రుసుము లేదు





# చందమామ కేమెల్
## రంగుల పోటీ

**బహుమతులు గెలవండి**

**కేమెల్**

1 ప్రథమ బహుమతి రూ. 15/-
3 రెండవ బహుమతి రూ. 10/-
10 మూడవ బహుమతి రూ. 5/-
10 సర్టిఫికెట్లు

చుక్కలు పెట్టిన గీత వెంట కత్తిరించండి.

ఈ పోటీలో 12 సంవత్సరాల లోపల వయస్సు కల పిల్లలు పాల్గొనవచ్చు.

పైన చూపించబడిన చిత్రాన్ని పూర్తిగా కేమెల్ రంగులతో నింపి దిగువ చిరునామాకు పంపండి:

పోస్ట్ బాక్స్ నం. 11501, నారిమన్ పాయింట్ పోస్ట్ ఆఫీస్, బొంబాయి 400 021.

న్యాయనిర్ణేతలదే చివరి నిర్ణయం. దీనికి అందరూ కట్టుబడాలి. ఈ సంబంధంగా ఎలాంటి పత్ర వ్యవహారాలు జరుపబడవు.

Name:.................................................................Age:..............................

Address:..........................................................................................

..........................................................................................

ఈ తేదీ లోపల ఎంట్రీలను పంపండి: 30-11-1984

**CONTEST NO39**

# మీరు చదివారా?

నవంబర్ '84

వెల: రూ. 4/-

# వనిత

దీపావళి
విశేషసంచిక



# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [''రైతు-వర్తకుడు''] కు ఆధారం, గంగిశెట్టి శివకుమార్ రచన.

ప్రతిమనిషీ తనతోటి వారిపట్ల, న్యాయధర్మాను గుణంగా ప్రవర్తించడం ఎంతయినా అవసరం. అలా కానినాడు, అమాయకులు కష్టాలపాలవడమే కాక, అందుకు కారకులైన వాళ్ళు అసహజపరిణామాలకులోను కావలసివస్తుంది. ఈ నీతి, ''న్యాయమైన డబ్బు'' అన్న కథలో తెలుసుకుంటాం.

## అమరవాణి

గ్రామస్తు సస్యహీనశ్చ, స్వామిహీనం చ మందిరమ్,
పంథాః సహాయశూన్యశ్చ, రుద్రభూమిసమాః స్మృతాః.

[పంటలు పండని ఊరు, యజమాని లేని ఇల్లు, తోడులేని ప్రయాణ మార్గం—శ్మశానంతో సరిపోల్చ దగినవి.]

సంపుటి 75 నవంబర్ '84 సంచిక 5

విడి ప్రతి : 2-00 :: సంవత్సర చందా : 24-00



# చందమామ కబుర్లు



## నిద్ర పోకుండా వుండడంలో సరికొత్త రికార్డు

ఇంగ్లాండుకు చెందిన మారీన్ వెసన్ 432 గంటలా 17 నిమిషాలు నిద్ర పోకుండా వుండి 1977 వ సంవత్సరం రికార్డు సృష్టించాడు. కాని ఇటీవల కెనడాకు చెందిన విక్టర్ జాటో అనే విద్యార్థి అతనికన్నా మూడు నిమిషాలు అదనంగా మేలుకుని వుండి కొత్త రికార్డు సృష్టించాడు.

## ఒంటికాలిపై నిలబడడంలో ప్రపంచ రికార్డు

శ్రీలంకకు చెందిన కుమార్ ఆనందన్ అనే కుర్రాడు, ముప్పైమూడు గంటలసేపు ఒకే కాలిపై నిలబడి, అందులో ప్రపంచ రికార్డు సృష్టించాడు.





## బాల మేధావి!

బెల్‌గ్రేడ్‌కు చెందిన పదేళ్ళ మాయిద్‌రాగ్ మియోలర్ – ఇరవైయేళ్ళ ప్రాయం గల విద్యార్థులు చదువుకునే విశ్వవిద్యాలయ తరగతులకు అనుమతించబడ్డాడు. విజ్ఞానశాస్త్రం, గణితం అభ్యసిస్తున్న ఈ అద్భుత మేధావి—పుట్టిన ఏడు నెలల కల్లా మాట్లాడడం మొదలుపెట్టి రెండేళ్ళు నిండే లోపల చదవడం నేర్చుకున్నాడట!

## మీకు తెలుసా?

1. అంతరిక్షంలో కృత్రిమగ్రహాన్ని ప్రవేశ పెట్టగల అవకాశాన్ని మొట్టమొదటఊహించిన విజ్ఞానవేత్త ఎవరు?
2. పుట్టుకతో దంతాలతో పుట్టిన సుప్రసిద్ధులైన వారెవరో మీకు తెలుసా?
3. తన జేబులో ఎప్పుడూ గుడ్లగూబను వుంచుకున్న, సుప్రసిద్ధమైన వనిత ఎవరో మీకు తెలుసా?
4. చరిత్రలో క్షుద్రంగా ముఖక్షవరం చేసుకునికనిపించే మొట్టమొదటి వ్యక్తి ఎవరో మీకు తెలుసా?

(సమాధానాలు 64 వ పేజీలో)



# వ్యాపారదక్షత

సుకేతుపట్టణంలో మందారగుప్త డనే ధనిక వర్తకుడుండేవాడు. అతడికి కొడుకులు లేరు, ఒక్కగానొక్క కూతురు, పేరు వత్సల. ఆమెకు తగినవాణ్ణి చూసి వివాహం చేసి, అల్లుడికి వ్యాపారం అప్ప చెప్పి, విశ్రాంతి తీసుకోవాలనుకున్నాడు, మందారగుప్తుడు.

ఈ విషయం అతడు భార్యతో సంప్రతించగా; ఆమె తన తమ్ముడి కుమారుడైన కుందనుడు వత్సలకు తగినవాడని అన్నది. మందారగుప్తుడు తన చెల్లెలి కొడుకు చంద్రపాలుడు తగినవాడని బదులు చెప్పాడు.

ఆ సమయంలో ఎంతో కాలంగా మందారగుప్తుడి దగ్గిర పని చేస్తున్న, మంజరీకు డనేవాడు అక్కడే వున్నాడు. వాడు, యజమానితో, "అయ్యా, నేను తమకు సలహా యివ్వగలిగినంత సమర్థుణ్ణి కాను. అయినా, తమరు అపార్థం చేసుకోక పోతే, ఒక చిన్న సలహా యివ్వదలిచాను," అన్నాడు.

"నీ సలహా ఏమిటో చెప్పు," అన్నాడు మందారగుప్తుడు.

"అమ్మాయికి భర్త కాదగినవాడు, మీ వ్యాపారాన్ని చక్కదిద్దుకోగల నేర్పరి అయివుండాలని, మీరిద్దరూ అభిప్రాయ పడుతున్నారు. అలాంటప్పుడు కుందనుడికీ, చంద్రపాలుడికీ ఒక పరీక్ష పెడితే ఎలా వుంటుంది?" అన్నాడు మంజరీకుడు.

"ఏమిటా పరీక్ష?" అని అడిగాడు మంధారగుప్తుడు.

"వాళ్ళిద్దర్నీ సువర్ణదేశం పంపుదాం. అక్కడ ఏ తరహా వ్యాపారానికి అవకాశం వున్నదో తెలుసుకుని వస్తారు. దాన్నిబట్టి మనం వాళ్ళ వ్యాపారదక్షతను అంచనా కట్టవచ్చు," అన్నాడు మంజరీకుడు.

జొన్నలగడ్డ రత్న



"సువర్ణదేశంతో వ్యాపారమా! ఆ దేశం పేరులో మాత్రమే సువర్ణమున్నది. వర్షాలు లేక రెండేళ్ళుగా, ఆ దేశ ప్రజలు కాటకంతో బాధపడుతున్నారు," అన్నాడు మందారగుప్తుడు.

"అయ్యా, ఆ కారణంగానే మనం, ఆ యిద్దర్నీ సువర్ణదేశం పంపబోతున్నాం. తతిమ్మా దేశాల్లో వున్న వ్యాపారావకాశాలు, ప్రతివ్యాపారస్థుడికీ తెలిసినవే. కరువుతో అలమటించిపోతున్న ఆ దేశంలో, ఇప్పుడు గాని లేక ముందు ముందుగాని ఎలాంటి వ్యాపారవస్తువులను లాభసాటిగా అమ్మవచ్చు? అదీ ఆ ఇద్దరూ తెలుసుకు రావలసిన స్థల్లగతి," అన్నాడు మంజరీకుడు.

ఈ పరీక్ష మందారగుప్తుడికి నచ్చింది. అతడు కుందనుణ్ణీ, చంద్రపాలుణ్ణీ సువర్ణదేశానికి పంపించాడు. కొన్ని రోజుల తరవాత, వాళ్ళిద్దరూ అక్కడి నుంచి తిరిగి వచ్చారు. మందారగుప్తుడు, మంజరీకుడికి కబురు చేసి, అతడు రాగానే ముందుగా కుందనుణ్ణి, సువర్ణదేశంలో వ్యాపారానికి ఎలాంటి వస్తువులు లాభసాటిగాగలవో చెప్పమన్నాడు.

"అసలేదైనా కొత్త వ్యాపారం ప్రారంభించదలిస్తే, అందుకు సువర్ణదేశాన్ని మీరెందుకు ఎన్నుకుంటున్నారో, నాకర్థం కావడం లేదు. అక్కడి పరిస్థితులు మనం విన్నదానికంటే భయంకరంగా వున్నవి. అయినా, మనం వ్యాపారం చేయదలిస్తే, ఆ దేశానికి ధాన్యాలూ మొదలైన తిండి పదార్థాలు పంపడం బావుంటుంది. వాటికి అక్కడ ఎంతయినా గిరాకీ వున్నది. లక్షలకులక్షలు లాభాలు గడించవచ్చు," అన్నాడు కుందనుడు.

మందారగుప్తుడు తరవాత కుందనుణ్ణి ప్రశ్నించినట్టే, చంద్రపాలుణ్ణి ప్రశ్నించాడు. అందుకు చంద్రపాలుడు, "సువర్ణదేశంతో వ్యాపారం చేయాలన్నదే, మీ ఉద్దేశం అయితే, అందుకు మనం తక్షణమే తగిన ఏర్పాట్లు చేసుకోవాలి. అక్కడ యిప్పుడు చింకిపాతలు కట్టుకుని

తిరుగుతున్నవాళ్ళే తప్ప, శుభ్రమైన బట్టలు ధరించినవాడు ఒక్కడు కూడా కనిపించలేదు. వ్యాపారవిషయాల్లో ఎన్నో లోతుపాతులు తెలిసిన మీకు, యింతకన్న ఎక్కువ వివరించనవసరం లేదనుకుంటాను," అన్నాడు.

మందారగుప్తుడు వాళ్ళిద్దర్నీ పంపివేసి, మంజరీకుడితో, "చెల్లెలి కొడుకని ఒకప్పుడు చంద్రపాలుడిపై ప్రేమాభిమానాలున్నమాట నిజం. కాని, సువర్ణ దేశంలోని కాటకపరిస్థితి చూశాక కూడా వాడు, ఆ దేశంతో వస్త్రవ్యాపారమంటూ మాట్లాడడం వింతనిపిస్తోంది. అలాంటి అవివేకికి, నా కుమార్తె నివ్వదలచలేదు. ఈ పరీక్ష కుందనుడి నిజసామర్థ్యాన్నీ, వ్యాపార దక్షతనూ బయటపెట్టింది. అతణ్ణి, నా అల్లుడుగా చేసుకుంటాను," అన్నాడు.

మంజరీకుడు ఎంతో వినయంగా, "కుందనుడూ, చంద్రపాలుల సమర్థతను అంచనాకట్టే విషయంలో, మీరీ వేళ ఎందుకనో పొరబడినట్టు కనబడుతున్నది. ఈ పరీక్షలో నెగ్గినవాడు చంద్రపాలుడని, నా నమ్మకం," అన్నాడు.

మందారగుప్తుడు ఎక్కడలేని ఆశ్చర్యం కనబరుస్తూ, "అదెలా? కొంచెం వివరంగా చెప్పు," అన్నాడు.



"ఎదురుగా కనబడుతున్న సాధక బాధకాలను, ఏ సాధారణ వ్యాపారి అయినా గుర్తించగలడు. కాని, భవిష్యత్తులో లభ్యం అయే అవకాశాలను ముందుగా అంచనా కట్టడంలోనే, వ్యాపారి దక్షత బయటపడుతుంది. కుందనుడి సంగతి చూడండి! అతడు ప్రస్తుతం సువర్ణదేశంలో వున్న వ్యాపారావకాశాలనే చూడగలిగాడు. అందులోనూ పెద్ద పొరబాటు చేశాడు. మనం యీ దేశం నుంచి ధాన్యం వగైరా తిండి పదార్థాలను, ఆ దేశానికి పంపడానికి రాజానుమతి లభించదు. ఒకవేళ సాహసించి మనం రహస్యంగా పంపినా, ఆకలీ

దారిద్ర్యాల్లో వున్న ఆ దేశప్రజలు వాటికి ధనం చెల్లించి కొంటారనేదికల్ల. మనం పంపేవి దోపిడీ అయి, మనకు చిల్లిగవ్వ మిగలదు,'' అన్నాడు మంజరీకుడు.

మందారగుప్తుడు అవునన్నట్టు తలాడించి, ''చంద్రపాలుడి సలహామేరకు మనం అక్కడికి వస్త్రాలు పంపినా అంతే జరుగుతుంది కదా!'' అన్నాడు.

''చంద్రపాలుడు ఆ దేశంతో వస్త్రాల వ్యాపారం యిప్పుడే ప్రారంభించమన లేదు. అందుకు తగిన ఏర్పాట్లు తక్షణం ప్రారంభించాలన్నాడు. అంతే కాక, మీ వ్యాపారదక్షత తెలిసినవాడు గనక, వివరాలు చెప్పనవసరం లేదని కూడా అన్నాడు. అతడి అభిప్రాయం తెలుస్తూనే వున్నది. మన పట్టణంలో ఎందరో మంచి నేతగాళ్ళున్నారు. తగినంత గిరాకీ లేక వాళ్ళ మగ్గాలెన్నో యిప్పుడు మూతపడి వున్నవి. మనం చౌకలో నాణ్యమైన బట్టలు వాళ్లచేత తయారుచేయించేందుకు పూనుకోవాలి,'' అన్నాడు మంజరీకుడు.

మందారగుప్తుడు ఎంతో కుతూహలంగా, ''అవును! కాని, ముందు ఆ దేశంలో కరువుకాటకాలు పోవాలికదా,'' అన్నాడు.

''ఏ దేశంలోనూ వానలు ఏళ్ళ తరబడి కురవకపోవడం అంటూ జరగదు. నాలుగు చినుకులు పడి పరిస్థితి మెరుగు పడిననాడు, సువర్ణదేశ ప్రజలు తమ చింకిపాతల్ని తప్పక అసహ్యించుకుంటారు. మనిషి తిండి తర్వాత ముఖ్యంగా కోరేది బట్టలేకదా! అందు వల్లనే, సూక్ష్మబుద్ధికల చంద్రపాలుడు తమకలాంటి సలహా యిచ్చాడు,'' అన్నాడు మంజరీకుడు.

దానితో మందారగుప్తుడికి చంద్రపాలుడి బుద్ధి ఎంత చురుకైనదో అర్థమైపోయింది. అతడు కుమార్తె వత్సల వివాహం చంద్రపాలుడితో అతి వైభవంగా జరిపించాడు.

చంద్రపాలుడు ఒకటి, రెండు సంవత్సరాలలోనే తన వ్యాపారదక్షత ఎలాంటిదో అత్త మామలకు రుజువుపరిచాడు.






మాహిష్మతీ నగరరాజైన యశోవర్ధనుడు అరవై ఏళ్ళ కాలం అవిచ్ఛిన్నంగా రాజ్యపాలన చేసి వృద్ధుడయాడు. ఇరవై ఏళ్ళ చిన్న వయసులో రాజ్యపాలనకు వచ్చిన అతడు, స్వయంగా అనేక యుద్ధాలు చేసి, రాజ్యపు ఎల్లలను ఎంతో విస్తరింపజేశాడు. అంత పెద్ద రాజ్యానికి అధినేత అయినా, యశోవర్ధనుడికి వృద్ధాప్యంలో మనశ్శాంతి లేకుండా పోయింది, అందుకు కారణం అతడి కుమారులు.

యశోవర్ధనుడికి తపోవర్ధనుడు, గుణవర్ధనుడు అని ఇరువురు పుత్రులు. పెద్దవాడైన తపోవర్ధనుడు ఇరవై అయిదేళ్ళ వయసువాడు. అతడికి లోక వ్యవహారాల మీద ఏమాత్రం ఆసక్తి లేదు. అతడెప్పుడూ తన కాలాన్ని ధర్మగ్రంథాలు పఠించటంలోనూ, వేదాంతులతో, పండితులతో ధర్మసూక్ష్మాల గురించి చర్చించటంలోనూ గడిపేవాడు.

చిన్నవాడైన గుణవర్ధనుడు ఇరవై ఏళ్ళ వయసువాడు. అతడిది యింకొక రకం తత్వం. అతడు కేవలం విలాసాల్లో కాలం గడుపుతూండేవాడు. అతడిలో ధర్మాధర్మ విచక్షణ అన్నదే లేదు. అసత్యవాదులూ, దుండగులూ, కపటులూ అతడికి ఆప్తమిత్రులు.

యశోవర్ధనుడు తన శేషజీవితాన్ని ఏ ఆశ్రమంలోనో దైవధ్యానం చేసుకుంటూ గడపాలనుకున్నాడు. తను రాజ్యపరిత్యాగం చేసేముందు సమర్థుడైనవాడొకడు



పరిపాలనా భారం వహించటం అవసరం. లేకపోతే దేశం అరాజకం పాలవుతుంది. ఐహిక విషయాల మీద ఏ మాత్రం ఆసక్తి లేని తన పెద్ద కుమారుడైన తపోవర్థనుడు తన తరవాత రాజు కావటం దేశానికి క్షేమం కాదు! ఇక పోతే చిన్నవాడు గుణవర్థనుడున్నాడు.

గుణవర్థనుడి దుండగాలను గురించి యశోవర్థనుడు విని వున్నాడు. స్వయంగా అతణ్ణి చాలాసార్లు మందలించటం కూడా జరిగింది. ఇరవై ఏళ్ళ వయసులో ఎవరైనా అలాగే ప్రవర్తిస్తారని కూడా యశోవర్థనుడు అనుకున్నాడు. రాజ్య భారం నెత్తిన పెడితే, అతడికి బాధ్యతలు తెలిసిరాగలవన్న నమ్మకం కలిగిందాయనకు.

అయితే, మంత్రి సామంతులలో కొందరితో యీ విషయమై మాట్లాడినప్పుడు, వారు గుణవర్థనుడు రాజు కావటాన్ని వ్యతిరేకించారు. పెద్దవాడైన తపోవర్థనుడుండగా, చిన్నవానికి రాజరికం కట్టబెట్టడం ప్రజలలో అశాంతిని రేకెత్తించగలదని వారు సంశయం వెలిబుచ్చారు.

ధర్మచింతా, గుణశీలాలూ వున్న తపోవర్థనుడు మాహిష్మతీ నగరానికి రాజు కావటం అందరికీ క్షేమం కాగలదని వారు సలహా యిచ్చారు.

ఈ సలహా యశోవర్థనుడికి మనస్కరించలేదు. క్షాత్రధర్మంలో ఏమాత్రం ఆసక్తినీ కనబరచని తన పెద్ద కుమారుడు రాజు కావటమంటే, అతడు ఏ మంత్రిచేతి కీలుబొమ్మగానో వుండవలసి వస్తుందని ఆయన భావించాడు. తను ఎన్నోయుద్ధాలలో నెత్తురోడ్చి సంపాయించిన రాజ్యం, తన వంశీకుల నుంచి పరాయివాళ్ళ హస్తగత మవుతుందని కూడా భయపడ్డాడు.

ఇలాటి భయ సందేహాలతో కొంత కాలం మథనపడి యశోవర్థనుడు చివరకు ఒక నిర్ణయానికి వచ్చాడు. అది, తన రాజ్యంలోని సామంతులనూ, పెద్దలనూ,

పౌరముఖ్యులనూ ఒకచోట సమావేశ పరచటం; వారికి తన అభిప్రాయం తెలియపరిచి, చిన్నవాడైన గుణవర్ధనుణ్ణి తన తరవాత రాజుగా అంగీకరించవల సిందని కోరటం.

ఇందుకుగాను కొన్నాళ్ళ తరవాత రాజ్యంలోని సామంతులూ, పెద్దలూ పౌరముఖ్యులూ సభకు ఆహ్వానించ బడ్డారు.

అందరూ సమావేశం అయిన తరవాత, యశోవర్ధనుడు వారికి తన అభిప్రాయం తెలియపరిచాడు. అంతేకాక, గుణవర్ధనుడు తన తరవాత పట్టాభిషిక్తుడు కావటానికి, తన పెద్ద కుమారుడైన తపోవర్ధనుడు ఎటువంటి అభ్యంతరం చెప్పడని కూడా రాజు సామంతులకు హామీ యిచ్చాడు.

అవగుణాలపుట్ట అయిన గుణవర్ధనుడు రాజు కావటం సభలో ఎవ్వరికీ యిష్టం లేదు. అయినా, ఆ మాట రాజుతో అనేందుకు ప్రతివారూ జంకారు. అలాంటి సమయంలో వీరపుర సామంతుడయిన సూర్యవర్మ ధైర్యంగా సభలో లేచి నిలబడి, గుణవర్ధనుడి దుండగాలను గురించి చెప్పి, అతడు రాజు కావటానికి ఏ మాత్రం తగడని తన అభిప్రాయం ప్రకటించాడు.



సభలో హర్షధ్వానాలు చెలరేగినై. సూర్యవర్మ చెప్పిన దానిని బలపరుస్తూ చాలామంది సామంతులు మాట్లాడారు. కొందరు యశోవర్ధనుణ్ణి మరి కొంతకాలం రాజ్యపాలన భారం వహించవలసిందని కోరారు. యీ మధ్యకాలంలో తపోవర్ధనుడికి రాజ్య వ్యవహారాల్లో ఆసక్తి కలిగించేందుకు ప్రయత్నించవలసిందిగా విన్నవించారు.

యశోవర్ధనుడికి ఏమి చేసేందుకూ పాలుపోలేదు. ఇందరు సామంతులనూ, పెద్దలనూ వ్యతిరేకించి, తను చిన్న కొడుకును రాజుగా ప్రకటిస్తే, దేశంలో అంతర్యుద్ధం తప్పదు. తన సామంతు

లందరిలో బలవంతుడూ, పలుకుబడి కలవాడూ అయిన సూర్యవర్మ యిలాంటి తిరుగుబాటుకు తప్పక నాయకత్వం వహిస్తాడు; ప్రస్తుతానికి దేశంలో శాంతి కాపాడాలంటే, తను రాజపరిత్యాగం చేసే ప్రయత్నం విరమించుకున్నట్టు ప్రకటించటం ఒక్కటే మంచి మార్గంగా ఆయనకు తోచింది. ఆయన అలాగే చేశాడు. అది విన్న సభికుల్లో ఆనందోత్సాహాలు వెల్లివిరిసినై.

సభ చాలించిన తరవాత యశోవర్ధనుడు తన మంత్రిని వెంటబెట్టుకుని సరాసరి ఉద్యానవనానికి వెళ్ళాడు. అక్కడ ఆయన మంత్రిని సంప్రతించగా, అతడు సూర్యవర్మతో ఏకాంతంగా మాట్లాడటం మంచిదని యశోవర్ధనుడికి సలహా యిచ్చాడు.

సామంతుల్లో బలవంతుడైన అతణ్ణి తమ పక్షం చేసుకుంటే, అంతా చక్కబడగలదని మంత్రి తన అభిప్రాయంగా రాజుకు చెప్పాడు.

సూర్యవర్మ ఉద్యానానికి పిలిపించబడ్డాడు. యశోవర్ధనుడు సగౌరవంగా అతడికి తన పక్కన కూర్చునేందుకు చోటు చూపి, "వర్మా! నీవు యీనాటి సభలో నిర్భయంగా వెలువరించిన అభిప్రాయాలతో నేను ఏకీభవించలేకపోయినా, నీ ధైర్యాన్ని మెచ్చుకుంటున్నాను. వీరపుర సామంతులెప్పుడూ ప్రభుభక్తిపరాయణులని నాకు తెలుసు. గుణవర్ధనుడు యింకా



చిన్నవాడు. నీ బోటి అనుభవజ్ఞుల అండ దండలూ, సహాయ సహకారాలూ వుంటే, అతడు చక్కని పరిపాలకుడు కాగలడని నా అభిప్రాయం,'' అన్నాడు.

''మహారాజా! ధర్మాధర్మాలు తెలిసిన వాడూ, సాధుశీలుడూ అయిన యువరాజు తపోవర్థనుడుండగా, మీరు రాజ్యాన్ని మరెవరికో కట్టబెట్ట చూడటం, ప్రజల దృష్టిలో న్యాయం అనిపించుకోదు,'' అన్నాడు సూర్యవర్మ.

''తపోవర్థనుడు లౌకిక వ్యవహారాల్లో ఏ మాత్రం ఆసక్తి వున్నవాడు కాదు. అలాంటివాడి పరిపాలనలో రాజ్యం తప్ప కుండా అరాజకం పాలవుతుంది,'' అన్నాడు, యశోవర్థనుడు.

''అతడికి లౌకిక విషయాల్లో ఆసక్తి కలిగించటం ఏమంత కష్టం కాదు. జ్యేష్ఠుడుగా అతడు నిర్వహించవలసిన బాధ్యతలను గుర్తుచేస్తే, అతడు తప్పక రాజ్యభారం వహించగలడు,'' అన్నాడు సూర్యవర్మ.

యశోవర్థనుడు మంత్రి కేసి సాభిప్రాయంగా చూశాడు. మంత్రి, సూర్యవర్మ చెప్పిన దానికి అవునన్నట్టు తల వూపాడు.

''అలా అయితే, తపోవర్థనుణ్ణి ఒక్క సంవత్సరం పాటు నీ సంరక్షణలో వుంచుతాను. ఈ కాలంలో అతడికి లౌకిక వ్యవహారాల్లో ఆసక్తి కలిగించి, రాజార్హమైన విద్యాబుద్ధులు నేర్పగలవా?'' అని అడిగాడు యశోవర్థనుడు.





సూర్యవర్మ అందుకు అంగీకరించాడు. ముందుగా తను వీరపురం వెళ్ళి, అక్కడి పరిపాలనా వ్యవహారాలను తన కుమారుడు చంద్రవర్మకు ఒప్పచెప్పి, కొద్ది రోజులలోనే రాజధానికి తిరిగి రాగలనన్నాడు. ఇందుకు యశోవర్ధనుడు సరేనన్నాడు.

సూర్యవర్మ యశోవర్ధనుడి దగ్గిర సెలవు తీసుకుని తన విడిదికి వెళ్ళాడు. ఆ రోజు సాయంత్రమే వీరపురం వెళ్ళేందుకు సన్నాహాలు ప్రారంభించాడు.

సూర్యవర్మ యీ విధంగా తిరుగు ప్రయాణానికి సన్నాహాలు చేసుకుంటూ వుండగా, అతణ్ణి దారిలో పొంచి వుండి హత్య చేసేందుకు మరొక ప్రదేశంలో ఏర్పాట్లు జరుగుతున్నవి. దీనికి నాయకుడు సర్పకేతు డనే ఒక సామంతుడు. అతడి రాజ్యం వీరపురం ఎల్లలలోనే వున్నది. ఎలా అయినా తను వీరపురాన్ని చేజిక్కించుకోవాలని అతడు ఎంత కాలంగానో వ్యూహాలు పన్నుతున్నాడు, కాని సాధ్యం కాలేదు. ఈనాడు, యశోవర్ధనుడి చిన్న కొడుకైన గుణవర్ధనుణ్ణి తన పక్షానికి తిప్పుకోవటం ద్వారా తన పని సానుకూలం కాగలదని అతడు వూహించాడు.

తండ్రి తరవాత తను రాజు కావటానికి వ్యతిరేకించినవాడు వీరపుర సామంతుడైన సూర్యవర్మ అని తెలిసినప్పుడు, గుణవర్ధనుడు నిలువెల్లా దహించుకు పోయాడు. అతడి అండ చూసుకునే తతిమ్మా సామంతులు కూడా తనకు వ్యతిరేకులయ్యారని అతడు భావించాడు. కాని, సూర్యవర్మను తను ఒంటరిగా ఎదిరించలేడు. తన వెంట తిరిగే మిత్రుల్లో ఎవరూ కూడా అంత ధైర్యసాహసాలు కలవాళ్ళు కారు.

గుణవర్ధనుడు, సూర్యవర్మ మీద పగ తీర్చుకోవటం ఎలాగా అని ఆలోచిస్తున్న సమయంలో, సర్పకేతుడు అతణ్ణి చూడ వచ్చాడు. ఇద్దరూ ఒకరి మనోభావాలను మరొకరు తెలుసుకున్నారు. కొద్దిమంది అంగరక్షకులతో వీరపురం పోతున్న

సూర్యవర్మను, కొండలలో హఠాత్తుగా ఎదిరించి చంపటం చాలా తేలిక అని సర్పకేతుడు చెప్పాడు. అందుకు అవసరం అయిన బలగం తన వెంట వున్నదని హామీలు యిచ్చాడు.

"మీరు యీ పని విజయవంతంగా నెరవేర్చగలిగితే, ఏదో ఒకనాడు మీరు కోరిన సహాయం చేస్తాను. బలవంతుడైన సూర్యవర్మ ఆటంకం లేనినాడు నేను రాజు కావటం నిజం!" అన్నాడు గుణవర్ధనుడు.

"అందులో సందేహం లేదు. అలా జరుగుతుందని ముందుగా వూహించే, నేను సూర్యవర్మ సంస్థానాన్ని ఆక్రమించుకునేందుకు అవసరమైన వ్యూహం ఆలోచించి వుంచాను. అతడి మరణవార్త తెలియగానే, నా సైన్యం ఆ సంస్థానం మీద పడి ఆక్రమించుకుంటుంది. అందుకు సూర్యవర్మ కొడుకు చంద్రవర్మ పెద్ద ఆటంకం కాదు. నా సైన్యం అంతా మామూలు పౌరులు ధరించే ఉడుపులు ధరించి వీరపురం కోటను ఆక్రమించుకుంటారు. యశోవర్ధన మహారాజుకు, అది క్రూరుడైన సామంతుడి మీద సంస్థాన ప్రజలు చేసిన తిరుగుబాటుగా కనిపించేటట్టు చూడాలి." అన్నాడు సర్పకేతుడు.




"అందుకు అవసరం అయిన సహాయం నేను చేస్తాను. సూర్యవర్మ ప్రజాకంటకుడని మా తండ్రిగారితో సమయం చూసుకుని చెపుతాను. అతడి హత్య వీరపుర సంస్థాన సరిహద్దుల్లోనే జరగటం దీన్ని బాగా బలపరుస్తుంది. తతిమ్మా ఏర్పాట్లు మీరు చేయండి," అన్నాడు గుణవర్ధనుడు.

గుణవర్ధనుడి మాటలు సర్పకేతుడికి చాలా ఉత్సాహాన్ని కలిగించినై. బలవంతుడైన సూర్యవర్మ ఆటంకం తొలగిన నాడు, గుణవర్ధనుణ్ణి మాహిష్మతీ నగర రాజును చేయటం ఏమంత కష్టం కాదని అతడికి తోచింది. సూర్యవర్మను హత్య

చేసిన తరువాత తను వీరపుర సంస్థానాన్ని తన సంస్థానంలో కలుపుకోవటమే గాక, మాహిష్మతీ రాజాస్థానంలో కూడా గొప్ప పలుకుబడిని సంపాయించవచ్చుననుకున్నాడు.

ఈ విధంగా సూర్యవర్మను హత్య చేసేందుకు కుట్రపన్నిన సర్పకేతుడు హడావిడిగా రాజధాని నగరం వదిలి, తన అనుచరులతో వీరపుర సంస్థాన సరిహద్దుల్లో పొంచి వుండి సూర్యవర్మ రాక కోసం ఎదురు చూడసాగాడు.

సూర్యవర్మకు తన మీద జరుగుతున్న కుట్ర విషయం ఏమీ తెలియదు. అతడు కొద్దిమంది అనుచరులతో, సేవకులతో కలిసి ఆ సాయంకాలమే తన సంస్థానానికి బయలుదేరాడు. మధ్యదారిలో ఆ రాత్రికి ఒకచోట మజిలీచేసి సూర్యోదయం కాగానే మళ్లీ ప్రయాణం సాగించాడు.

ఆనాటి సూర్యాస్తమయ సమయానికి సూర్యవర్మ తన సంస్థాన సరిహద్దులను చేరాడు. ఆ ప్రాంతమంతా కొండలా, చిట్టడవులా మయం. ఏ ప్రమాదాన్నీ శంకించని సూర్యవర్మ తన గుర్రాన్ని ముందు నడుపుతూ, తను యువరాజు విషయంలో స్వీకరించనున్న కొత్త బాధ్యతలను గురించి ఆలోచిస్తున్నాడు.

హఠాత్తుగా కొండగుట్టలలో చిన్న కలకలం బయలుదేరింది. సూర్యవర్మ ఆ ధ్వని వింటూనే గుర్రాన్ని ఆపి వెనుతిరిగి తన అనుచరులకేసి చూసేంతలో, రాళ్ళ వెనకనుంచీ, గుబురుగావున్న చెట్ల వెనకనుంచీ సామాన్య పౌరదుస్తులు ధరించి వున్న అనేకమంది సాయుధులైన రౌతులు భీకరంగా అరుస్తూ వాళ్ళమీద పడ్డారు. సూర్యవర్మ రెప్పపాటు కాలంలో ఒర నుంచి కత్తి దూసి, ధైర్యంగా శత్రువులను ఎదుర్కొన్నాడు. కాని, ఆ సరికే అతడు, తన అనుచరుల నుంచి వేరు చేయబడ్డాడు. పదీ పన్నెండుమంది సాయుధులు అతి భీకరంగా అరుస్తూ ఒక్కుమ్మడిగా అతడి మీద విరుచుకు పడ్డారు. —(ఇంకావుంది)






# రైతు-వర్తకుడు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీ ప్రయత్నం ప్రతిసారీ విఫలమవుతున్నా, నువు విరమించకపోవడం ఆశ్చర్యంగా వున్నది. ఇంత రాత్రివేళ, నిన్ని శ్మశానానికి పంపి ఎవరో నిన్నూ, నీ రాజపదవినీ అవమానిస్తున్నారు. నిజం తెలుసుకుని, నువ్వు తిరిగి వాళ్ళను అవమానించే అవకాశం దొరికినప్పుడు, ఉదారత్వం చూపుతావో లేక ప్రతీకారం చేస్తావో తెలియదు. ఇందుకు నిదర్శనంగా రత్నపాదుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ యిలా చెప్పసాగాడు:

రత్నపాదుడు గోపవరంలో హంసపాదు డనే చిన్న రైతు కొడుకు. అతడు వున్న

## బేతాళ కథలు



ఊళ్ళో చదువు నేర్చుకుని తెలివైనవాడని పించుకున్నాడు. అంతటితో అతడి విద్యా దాహం తీరక దూరప్రాంతాలకు వెళ్ళి, చాలామంది గురువులను ఆశ్రయించి, పండితుడై ఇంటికి తిరిగి వచ్చాడు.

అతడు ఇంటికి వచ్చిన కొద్ది రోజులకే, ఆ నోటా, ఈ నోటా అతడి పాండిత్యపటిమ గురించి రాజు విన్నాడు. ఆయన నెలకు వెయ్యి వరహాల జీతం మీద రత్నపాదుడికి తన ఆస్థానంలో ఉద్యోగం యివ్వదలచి నట్టు వర్తమానం పంపాడు.

కొడుకుకు రాజాస్థానంలో ఉద్యోగం దొరకడం హంసపాదుడికి చాలా సంతోషం కలిగించింది.

ఆయన రత్నపాదుడితో, "కష్టపడి చదివి మంచి పండితుడివయ్యావు. నువ్వు అడక్కుండానే రాజుగారి ప్రాపకం దొరికింది. ఇక పెళ్ళి చేసుకుని ఒక ఇంటి వాడివయ్యావంటే, నా కేచింతా వుండదు. నువ్వు సరేనంటే, నీకు తగిన కన్యను చూస్తాను. పెళ్ళి చేసుకుని ఒకేసారి రాజధానీ నగరానికి వెళ్ళి కాపరం పెట్టు," అన్నాడు.

అంత త్వరగా వివాహం చేసుకోవడం రత్నపాదుడికి ఏమాత్రం యిష్టం లేక పోయినా, తండ్రి మాటను కాదనలేక పోయాడు.

హంసపాదుడి ఇంటి పొరుగునే గోపీనాధుడనే ధనికుడి భవనం వున్నది. అతడు వ్యాపారంలో లక్షలు గడించాడు. హంసపాదుడితో అతడికి దూరపు చుట్టరికమే కాక, చిన్ననాటి నుంచీ స్నేహం కూడా వున్నది.

గోపీనాధుడికి పెళ్ళీడు కొచ్చిన కూతురున్నది. ఆమె అందమైనదే కాక, మంచి చురుకుదనం, వినయగుణం కలది. ఎంతో కాలంగా హంసపాదుడు ఆమెను తన కొడుకుకు చేసుకోవాలన్న ఆశతో వున్నాడు.

కొడుకు పెళ్ళి చేసుకునేందుకు అంగీకారం తెలపగానే హంసపాదుడు, గోపి

నాధుడి ఇంటికి వెళ్ళి, ఆ ప్రస్తావన తెచ్చాడు. అది వింటూనే గోపీనాధుడు నివ్వెరపోయి, ''మిత్రమా, మన మధ్య అంతో, యింతో దూరపు చుట్టరికంతో పాటు స్నేహం కూడా వున్నది; కాదనను. మనం వియ్యంకులం కావడానికి, ఆ రెండు మాత్రమే చాలవు. బాగా స్థితి మంతుడైన వాడికి, నా కూతుర్ని యివ్వా లనుకుంటున్నాను. అలా చేయకపోతే, నేను ఒక్కగానొక్క కూతురుకు అన్యాయం చేశానని అందరూ తప్పుపడ తారు. బుద్ధిహీనుడి కింద జమకడ తారు,'' అన్నాడు.

ఆ జవాబుకు హంసపాదుడు ముఖం చిన్నబుచ్చుకుని, ''నా కొడుక్కేమి లోటు? అతడికి రాజాశ్రయం వున్నది. నెలకు వెయ్యి వరహాల సంపాదన వున్నది. అతడికున్న పాండిత్యంతో, ఏనాటికైనా ఉచ్చస్థితికి వస్తాడు,'' అన్నాడు.

''మరొకలాగా అనుకోకు. రాజధానీ నగరంలో వెయ్యి వరహాల జీతం ఏదో బతకడానికి సరిపోతుందిగాని, సుఖంగా మాత్రం కాదు,'' అన్నాడు గోపీనాధుడు నిదానంగా.

హంసపాదుడు ఇంటికి తిరిగి వచ్చాడు. తండ్రి విచారంగా వుండడం చూసి, రత్నపాదుడు కారణం అడిగాడు. ఆయన జరిగింది చెప్పాడు. తండ్రికి గోపీనాధుడి కూతుర్ని కోడలుగా తెచ్చుకోవాలన్న





ఉద్దేశం వున్నదని, ఆనాటివరకూ రత్నపాదుడికి తెలియదు.

తర్వాత కొద్ది రోజులకు పొరుగూరి రైతు తారాంగుడి కుమార్తెతో, రత్నపాదుడి వివాహం జరిగింది.

ఒక నెల తరవాత అతను భార్యతోపాటు రాజధానీ నగరంలో కాపరం పెట్టాడు.

క్రమక్రమంగా అతనికి రాజాస్థానంలో మంచి పేరు ప్రఖ్యాతులు వచ్చాయి. కాని, ఆర్థికంగా అతని పరిస్థితి చెప్పుకోదగినంతగా మెరుగుపడలేదు. రానురాను కుటుంబం పెరిగింది. దానితోపాటు ఖర్చులు పెరిగి రత్నపాదుణ్ణి చికాకు పరిచాయి.

బాగా ఆలోచించి అతడు భార్యా బిడ్డలతో ఇంటికి తిరిగి వచ్చాడు. అసరికి బాగా వయసు మీరిపోయినందున, హంసపాదుడు సరిగా వ్యవసాయం చేయలేకపోతున్నాడు. రత్నపాదుడు వ్యవసాయాన్ని స్వయంగా చేపట్టి, తనకున్న పొలంతో పాటు మరి కొంత పొలాన్ని కౌలుకు తీసుకున్నాడు.

రాజు కొలువులో పట్టుపరుపుల మీద కూర్చుని, సాహిత్యచర్చలు చేసిన రత్నపాదుడికి, ఎండనకా, వాననకా కష్టపడి పని చేయవలసిరావడం చాలా శ్రమ అనిపించింది. అయినా, పట్టుదలకొద్దీ త్వరలోనే, ఈ కొత్త జీవితానికి అలవాటు పడిపోయాడు.

ఉన్నది చిన్న గ్రామం కావడం వల్ల, రత్నపాదుడు వచ్చే ఆదాయంలో కుటుంబ ఖర్చులకు పోను కొంత మిగల్చగలిగేవాడు. ఈ విధంగా నాలుగేళ్ళు గడిచేసరికి అతడి వద్ద కొంత డబ్బు చేరింది. దానితో అతడు వ్యవసాయంతో పాటు, వ్యాపారం కూడా ప్రారంభించాడు. తోటి రైతులవద్ద ముందుగానే ధాన్యం కొనుగోలు చేసి, పట్టణం నుంచి వచ్చే వర్తకులకు లాభసాటిగా అమ్మసాగాడు.

ఇలా పదేళ్ళు గడిచేసరికి రత్నపాదుడు మరి కొన్ని యితరత్రా వ్యాపారాలు కూడా-

చేసి, లక్షలార్జించి పెద్ద భవనం కట్టుకున్నాడు. ఇప్పుడతను ఇతరుల దృష్టిలో సమర్థుడైన గొప్ప వ్యాపారి. అతడికి పెద్ద కొడుకు చేతికి అంది వచ్చి, తండ్రి నుంచి వ్యాపారంలో మెళుకువలు గ్రహించి దిట్ట అనిపించుకున్నాడు.



అనాడు రత్నపాదుడికి కుమార్తె నివ్వడానికి నిరాకరించిన గోపీనాధుడు, అమెను పొరుగు గ్రామంలో వున్న సంపన్నుల ఇంటి కోడలిగా చేశాడు. ఆమె కూతురు యిప్పుడు పెళ్ళీడుకు ఎదిగి వున్నది. తన మనమరాలిని రత్నపాదుడి కొడుక్కు యిచ్చి పెళ్ళి చేయాలన్న ఆలోచనలో వున్నాడు, గోపీనాధుడు. కుర్రవాడి చురుకుదనం, వ్యాపార విషయాల్లో అతడి చొరవా అతణ్ణి బాగా ఆకర్షించాయి. పైగా లక్షాధికారి కొడుకు!

ఒకనాడు గోపీనాధుడు, హంసపాదుణ్ణి కలుసుకుని తన మనసులోని సంగతి బయటపెట్టి, "గతంలో జరిగిందాన్ని గురించి బాధపడడం భావ్యం కాదు. విధివశాత్తూ, అనాడు మనం వియ్యంకులం అయ్యే అవకాశం చేజారిపోయింది," అన్నాడు.

హంసపాదుడు ఒక క్షణం ఆగి కోపంగా, "అదేం వీలుపడదు! నా మనమడికి పెద్ద, పెద్ద కోటీశ్వరులు తమ పిల్లలనివ్వడానికి సిద్ధంగా వున్నారు." అన్నాడు.

ఒకనాడు గోపీనాధుడివల్ల తనకు జరిగిన అవమానాన్ని హంసపాదుడు మరిచిపోలేదు. అది యింకా అతడి మనస్సును బాధిస్తూనే వున్నది. అతడు ఎంతో కాలంగా తగిన సమయం కోసం ఎదురు చూస్తున్నాడు. ఇన్నాళ్ళకు గొప్ప ధనవంతుడైన తన కొడుకు కారణంగా, గోపీనాధుణ్ణి అవమానించే అవకాశం వచ్చింది. దాన్ని అతడు ఉపయోగించుకోదలిచాడు.

కాని రత్నపాదుడు కల్పించుకుని, "నాన్నా, గతాన్ని మరిచిపోదాం. మనకు

ధనానికేం తక్కువ!" అని తండ్రిని గోపీనాధుడితో వియ్యమందేందుకు ఒప్పించాడు.

తరవాత గోపీనాధుడి మనమరాలికీ, హంసపాదుడి మనమడికీ వైభవంగా వివాహం జరిగిపోయింది.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, ఒకనాడు తండ్రినీ, తననూ అవమాన పరిచిన గోపీనాధుడి మనమరాలిని, రత్నపాదుడు తన కొడుకుకు ఎందుకు చేసుకున్నాడు? తను పొందిన అవమానానికి ప్రతీకారం చేసే అవకాశం వచ్చినప్పటికీ, ఎందుకు జారవిడిచాడు? గొప్ప ఉదారుణ్ణనిపించుకోవాలనా?, లేక గోపీనాధుడంతటివాడే తనను అడిగే స్థితికి వచ్చాడన్న సంతృప్తితోనా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగులుతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "గోపీనాధుడు ప్రతీకారం చేయవలసినంత తప్పు ఏమీ చేయలేదు. అతడు మంచి లౌకికజ్ఞానం కల వ్యాపారస్థుడు. కయ్యానికిలాగే, వియ్యానిక్కూడా సమఉజ్జీలు అవసరం. అందుచేత అతడు తన కుమార్తెను సంపన్నుల ఇంట యివ్వాలనుకున్నాడు. రత్నపాదుడికి చిన్న రైతుస్థాయి నుంచి, గొప్ప వ్యాపారి అయాక, గోపీనాధుడి మనస్తత్వం అర్థం చేసుకోవడం ఏమంత కష్టం కాదు.

పోతే, రత్నపాదుడి తండ్రి హంసపాదుడు కేవలం చిన్న రైతు. డబ్బు మనుషుల మధ్య అంతరాలను ఏర్పరుస్తుందనీ, వాటిని దాటి రావడం అంత తేలిక అయిన విషయం కాదనీ తెలియనివాడు. అందువల్లనే, గోపీనాధుడి అనంగీకారాన్ని, అవమానంగా భావించి తిరిగి అతణ్ణి అవమానించాలనుకున్నాడు. గొప్ప వర్తకుడైన రత్నపాదుడికి ఇలాంటి అవసరం లేదు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)






చంద్రపురి జమీందారు వద్ద, కేశవస్వామి అనే దివాను ఎంతోకాలంగా పని చేస్తున్నాడు. ఆయన వృద్ధాప్యం వల్ల పని భారం మోయలేక పోతున్నాడని, జమీందారు ఆయనకు అనుభవం వున్న సహాయకుణ్ణి ఒకరిని నియమించదలిచాడు.

ఈ సంగతి విన్న రామభద్రుడు, శివచంద్రుడు అనే వాళ్ళు జమీందారును కలుసుకున్నారు. జమీందారు వాళ్ళల్లో తనకు నచ్చిన ఒకర్ని ఎంపిక చేసుకోమని దివానుకు చెప్పాడు.

దివాను కేశవస్వామి ముందుగా రామభద్రుణ్ణి పిలిచి, ''దివాణం నడపడంలో రకరకాల సమస్యలు ఎదురవుతూ వుంటవి. ఒక సమస్యకూ, మరొకదానికీ పోలికే వుండదు. అంతేకాక, ఒక సమయంలో ఒక సమస్యను పరిష్కరించిన తీరు, మరొక సమయంలో అదే రకం సమస్యను పరిష్కరించేందుకు పనికి రాదు,'' అన్నాడు.

అందుకు రామభద్రుడు, ''అయ్యా, లోగడ నేను దివాణాల్లో పని చేసి ఎంతో అనుభవం గడించినవాణ్ణి,'' అన్నాడు.

దానికి కేశవస్వామి, ''ఒక దివాణంలో పనిచేసి గడించిన అనుభవం, మరొక దివాణం పనికి ఎంతవరకు ఉపకరిస్తుందో, నాకు తెలియదు. సరే, యీ దివాణం గురించి చెబుతున్నాను. ఇక్కడ ఎన్నో పనులు పేరుకుపోయి వున్నవి. అంతే కాక అవి ఎన్నో జటిలమైన సమస్యలతో ముడిపడి వున్నవి. అంతా ఒక క్రమ పద్ధతిలో పెట్టడానికి, నీదంటూ ఒక ప్రత్యేకమైన ఆలోచనాధోరణి ఏమైనా వున్నదా?'' అని అడిగాడు.

''నేను పరిష్కరించవలసిన ప్రతి సమస్యనూ క్షుణ్ణంగా పరిశీలించి, దీనికి

కమలిని

సరైన సమాధానం యిది, అని ఒక నిర్ణయానికి వచ్చిన తరవాతే పనికి పూను కుంటాను. అందువల్ల పనులన్నీ అను కున్న పద్ధతిలో జరిపించడానికి, నాకు ఎటువంటి ఆటంకాలూ వుండవు." అన్నాడు రామభద్రుడు.

తరవాత దివాను, శివచంద్రుణ్ణి పిలిచి, రామభద్రుణ్ణి అడిగినట్టే అడిగాడు. అందుకు శివచంద్రుడు, "నేను ఏదైనా ఒక సమస్యను పరిష్కరించే ముందు, దానికి సంబంధించిన కొన్ని సరైన ప్రశ్నలు తయారు చేస్తాను. వాటికి తృప్తి కరమైన సమాధానాలు దొరికిన తరవాతే, కార్యక్రమం చేపడతాను," అన్నాడు.

ఇలా యిద్దరి సమాధానాలూ విన్న తరవాత దివాను కేశవస్వామి జమీందారు దగ్గిరకు వెళ్ళాడు.

"ఇద్దరూ తెలివిమంతుల్లా కనిపించారు. మీకు సహాయకుణ్ణి నియమించుకోవడం కొంత కష్టసాధ్యమై వుంటుంది," అన్నాడు జమీందారు దివానుతో.

"అయ్యా, అలాంటిదేం లేదు. తమరు శివచంద్రుడికి, యీ ఉద్యోగం యివ్వ వచ్చు," అన్నాడు దివాను.

"మీరు శివచంద్రుణ్ణి ఎన్నిక చేయ డానికి, ఏదైనా ప్రత్యేక కారణం వున్నదా?" అని జమీందారు దివాను నడిగాడు.

"కారణం వున్నది. ఒక పనిని చేపట్టి నప్పుడు, అందులో ఎదురయ్యే సాధక బాధకాలన్నీ వితర్కించుకుని, ప్రశ్నలను బట్టి సమాధానాలు వెదకడం సమర్థుడైన పాలకుడి లక్షణం. మనలో మనం ముందు సరైన ప్రశ్నలు వేసుకోగలిగితే, వాటికి సమాధానాలు కనుక్కోవడం ఏమంత కష్టం కాదు. శివచంద్రుడిలో, ఈ లక్షణాలుండడం వల్లనే, అతడీ పదవికి అర్హుడని నేను భావిస్తున్నాను," అన్నాడు దివాను.

జమీందారు, దివాను జవాబుకు తృప్తి పడి, శివచంద్రుణ్ణి అతడికి సహాయ కుడిగా నియమించాడు.



# విమర్శకుడు

ఒకానొక రాజ్యంలో చక్కని బొమ్మలు చేసే పనివాళ్ళు వుండేవారు. పక్షి ఈకలు, కాలి గోళ్ళు, జంతు చర్మాలు బొమ్మలకు వాడడంవల్ల, అవి జీవకళ ఉట్టిపడుతూండేవి.

ఒకసారి రాజుగారు సహజ వాతావరణం కోసం, తన ఉద్యానవనంలో ఆ బొమ్మల ప్రదర్శనం ఏర్పాటు చేశాడు. వాటిని చూసేందుకు చాలామంది జనం వచ్చారు. వారిలో ఒక విమర్శకుడు కూడా వున్నాడు. ఆయన పక్షులా, జంతువుల బొమ్మల దగ్గిర నిలబడి, అవి సహజంగా లేవంటూ వ్యాఖ్యానించ సాగాడు.

చివరకు ఆ విమర్శకుడికి ఒక గున్నమామిడి చెట్టుకొమ్మ మీద రెండు చిలకలు కనిపించినై. వాటిని చూస్తూనే ఆయన, "చిలక ముక్కు ఎంత ఎర్రగా వుంటుంది, యిలాగా! రంగులు కలపడం కూడా తెలియనివాడు, వీటిని తయారు చేశాడు. చిలకలకు మంచి గాజుకళ్ళు పెట్టడం కూడా అతడి చేతకాలేదు. అవేం రెక్కలు? అవేం కాలి గోళ్ళు?" అన్నాడు.

అంతలో ఆయన విమర్శిస్తున్న చిలకల్లో ఒకటి టపటపమంటూ రెక్కలాడించి ఎగిరి పోయింది. ఆ సమయంలో దాని రెక్క తగిలిన బొమ్మచిలక కొమ్మమీదినుంచి దభీమంటూ కిందపడి ముక్కలైంది. అంతవరకూ విమర్శకుడి వ్యాఖ్యానం విన్న జనం ఫక్కున నవ్వారు. విమర్శకుడు సిగ్గుతో తలవంచుకుని అక్కడినుంచి వెళ్ళి పోయాడు.

—రామవరపు గణేశ్వరరావు





# కొండంత ధైర్యం

రాత్రి రెండు జాములవేళ, నలుగురు ప్రయాణీకులు పడవలో నాగావళినది దాటి ఒడ్డు చేరారు. వాళ్ళు నాలుగు కోసులదూరంలో వున్న విక్రమపురం వెళ్ళాలి. రేవు దగ్గిర ఒక గుర్రపుబండి సిద్ధంగా వున్నది.

ప్రయాణీకులు గుర్రపుబండిలో ఎక్కి కూర్చున్నారు. చీకటికి తోడు చుట్టు పక్కల అంతా చిన్న చిట్టడవి. బండి గతుకులదారిలో నడుస్తున్నది. ఒకచోట ఒక ఎలుగుబంటూ, దాని పిల్లలు రెండూ కొద్ది దూరంలో దారికి అడ్డంగా వచ్చి, పక్కన వున్న చెట్లల్లోకి పరుగు తీసినై.

ఇది చూసి ప్రయాణీకుల్లో ఒకడు, "ఇంకా నయం; ఆ ఎలుగుబంట్లు మన మీదికి దూకినై కాదు! రాత్రి పూట ప్రయాణం చేయడం కన్న బుద్ధితక్కువ పని వుండదు," అన్నాడు.

ఆ వెంటనే ప్రయాణీకుల్లో ఒకడు, బండివాణ్ణి బండి ఆపమన్నాడు, ఆజ్ఞాపిస్తున్నట్టు. బండి ఆగగానే వాడు దభీమని కిందికి దూకి, దుస్తుల్లో నుంచి తళతళ మెరుస్తున్న పెద్ద కత్తి ఒకటి బయిటికి తీసి, "ఈ చింతడి పేరు, వినే వుంటారు? ఎలుగుబంట్ల కన్నా, పెద్ద పులుల కన్నా భయంకరుణ్ణి. ఈ చుట్టుపక్కల వున్న చిట్టడవీ, కొండప్రాంతాల, నా మాటకు తిరుగులేదు. చెప్పగానే తమదగ్గర వున్న డబ్బూ దస్కం యిచ్చే వాళ్ళకు, నేనె లాంటి హానీ కలిగించను. కాని, అవి యివ్వడానికి ఏ మాత్రం ఆలస్యం చేసినా, సహాయం కోసం కేకలు వేసినా—అలాంటి వాళ్ళను మరుక్షణమే యీ కత్తికి ఎర చేస్తాను. విన్నారు గదా? వెంటనే మీ దగ్గిర వున్న డబ్బూ, వేళ్ళ ఉంగరాలూ అన్నీ తీసి, మర్యాదగా యిక్కడ

ఎస్. వి. ఆర్. సత్యనారాయణమూర్తి

పెట్టండి!'' అంటూ నేల మీద చిన్న పంచపరిచాడు.

ప్రయాణీకులు ముగ్గురూ గడగడ వణికిపోతూ, తమ దగ్గిర వున్న డబ్బూ, బంగారు వస్తువులూ దొంగకు యివ్వ బోతున్నంతలో, బండివాడు చేతిలో వున్న చర్నాకోలును గాలిలో ఠపీమంటూ ఒక సారి మోగించి, "ఒరే, దారిదోపిడి దొంగ చింతడివి నువ్వేనా? నువ్వు బండీ ఎక్క టప్పుడే, నీ దొంగచూపు గమనించాను. అయినా వేచిచూద్దామని ఊరుకున్నాను. పార్వతీపురం జమీందారుగారు, నిన్ను పట్టేందుకు పంపిన గూఢచారిని, నేను!'' అంటూ కిందికిదూకి ఒకడుగు ముందుకు వేశాడు.

గూఢచారి అన్న పేరు వింటూనే దొంగ ఒక్క క్షణం నిలువెల్లా వణికిపోయాడు. ఆ మరుక్షణం ముగ్గురు ప్రయాణీకులూ, వాడి మీద కలియబడి కత్తి లాక్కుని చితకబాదారు. బండివాడు తాడుతో చింతడి కాళ్ళూ, చేతులూ బిగించి కట్టాడు. తరవాత నలుగురూ వాణ్ణి ఎత్తి బండిలో వేసి, విక్రమపురం కేసి బయలు దేరారు.

దారిలో ప్రయాణీకుల్లో ఒకడు, బండి వాణ్ణి, "ఈ దారిదోపిడి దొంగను పట్టేం దుకు తమరు గుర్రపుబండి తోలేవాడి వేషం వెయ్యవలసి వచ్చిందన్నమాట! తమరు జమీందారుగారి గూఢచారి అని ముందే తెలిస్తే, మేము వీణ్ణి చూసి



అంతగా భయపడిపోయేవాళ్ళం కాదు." అన్నాడు.

"అప్పుడు, యీ చింతడూ నాకు దొరికే వాడు కాదు. ఎలాగైతేనేం, యివాళ్టితో వీడి ఆట కట్టించాను," అన్నాడు బండి తోలేవాడు.

బండి విక్రమపురం చేరగానే, బండి వాడు కొత్వాలు ఇంటిముందు బండి ఆపి, తలుపుతట్టాడు. కొత్వాలు బయిటికి వచ్చి, చింతణ్ణి చూస్తూనే, "నీ బండిలో వచ్చిన వాళ్ళు, చాలా ధైర్యవంతుల్లా వున్నారు. మొత్తంమీద వీణ్ణి పట్టుకోగలిగారు. నేను, వీడికోసం ఎన్ని ఉచ్చులు వేసినా దొరి కాడు కాదు," అన్నాడు.

కొత్వాలు యిలా అనగానే ప్రయాణీకులు, "అయ్యా, వీణ్ణి పట్టేంత తెగువా, ధైర్యం మాకెక్కడిది! బండి తోలేవాడి వేషంలో వున్న పార్వతీపురం జమీందారు గారి గూఢచారి, ముందుగా వాణ్ణి బెదర గొట్టారు. అప్పుడు మాకు కొండంత ధైర్యం వచ్చి, చింతడి మీద కలియబడ్డాం. మా డబ్బు పోకుండా కాపాడినందుకు, తెల్లవారాక వారికి మాకు తోచిన బహుమానం యిచ్చుకుంటాం," అన్నారు ఎంతో సంతోషంగా.

ఈ మాటలకు కొత్వాలు ఆశ్చర్యపోయి, బండివాడితో, "ఒరేయ్, లక్ష్మన్నా! ఏమిటిది? నువ్వు గూఢచారివి కావడం ఏమిటి?" అన్నాడు.

అప్పుడు బండివాడు జరిగినదంతా కొత్వాలుకు చెప్పి, "అయ్యా, మేం నలుగురం వుండి, ఎంత దుష్టుడైన దారి దోపిడి దొంగ అయినా—ఒక్కణ్ణి పట్టి బంధించలేకపోవడం సిగ్గుచేటుగదా! అందుకే నేను గూఢచారిగా నాటకం ఆడాను," అన్నాడు.

కొత్వాలు, బండి లక్ష్మన్నను చాలా మెచ్చుకున్నాడు. ఈ సంగతి విన్న పార్వతీపురం జమీందారు, మర్నాడు నిండుసభలో లక్ష్మన్న సమయస్ఫూర్తినీ, ధైర్యాన్నీ పొగిడి విలువైన బహుమానాలిచ్చాడు.





# పాపిష్ఠిజన్మ

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పరిపాలించే కాలంలో బోధిసత్వుడు సుతను డనే పేరు గల పేద గృహస్థుగా జన్మించాడు. అతను పెరిగి పెద్దవాడై తన సంపాదనతో తల్లిదండ్రులను పోషిస్తూ వచ్చాడు. కొంత కాలానికి సుతనుడి తండ్రి చనిపోయాడు. తల్లి మాత్రం మిగిలింది. రోజల్లా శ్రమపడినా తనకూ, తన తల్లికీ చాలినంత సంపాదించలేక సుతనుడు చాలా ఇబ్బందిపడుతూ ఉండేవాడు.

ఆ దేశపు రాజుగారికి వేటయందు చాలా ప్రీతి. ఆయన తరుచు అడవికి వెళ్ళి అక్కడ అడవిజంతువులను వేటాడుతూ ఉండేవాడు. ఒకనాడు రాజుగారు ఒక లేడిని తరుముతూ అడవిలో చాలా దూరం వెళ్ళి, ఎలాగైతేనేం దాన్ని బాణంతో కొట్టాడు. లేడి బాణం దెబ్బకు చచ్చి పడిపోయింది. సమీపంలో రాజుగారి భటు లెవరూ లేరు. అందుచేత రాజే ఆ లేడిని భుజాన వేసుకుని తిరిగి రాసాగాడు.

మిట్టమధ్యాహ్నం ఎండ మండిపోతున్నది. వేట మూలంగానూ, లేడిని మోసుకు వస్తూవుండటం వల్లనూ రాజు చాలా డస్సిపోయి ఉన్నాడు. అటువంటి స్థితిలో ఆయనకు ఒక విశాలమైన మర్రి చెట్టు నీడ చల్లగా కనిపించింది. రాజు లేడి శరీరాన్ని నీడలో పడేసి, విశ్రాంతి తీసుకోవటానికి తాను కూడా చతికిలబడ్డాడు.

మరుక్షణమే రాజు ఎదట ఒక బ్రహ్మరాక్షసి ప్రత్యక్షమై, "నిన్ను తినేస్తాను!" అంటూ మీదికి రాసాగింది.

"ఎవరు నువు? నన్ను తినటానికి నీకేమి అధికారం ఉన్నది?" అని రాజు బ్రహ్మరాక్షసిని అడిగాడు.



ఏ రోజూ కూడా ఆహారసమస్య లేకుండా చేస్తాను. నేను ఈ దేశానికి రాజును. అందు చేత నీకు రోజూ అన్నంతోపాటు, ఒక మనిషిని పంపగలను," అన్నాడు రాజు.

ఈ మాట విని బ్రహ్మరాక్షసి చాలా సంతోషించింది.

"అలా అయితే నిన్ను విడిచిపెడ తాను. కాని ఏ రోజు నాకు వేళకు ఆహారం రాకపోయినా, నేనే బయలు దేరి వచ్చి నిన్ను తినేస్తాను!" అన్నది బ్రహ్మరాక్షసి.

రాజుగారు లేడిని బ్రహ్మరాక్షసికి ఇచ్చేసి, తన రాజధానికి తిరిగి వచ్చి, తన మంత్రితో జరిగినదంతా చెప్పాడు.

"మహారాజా, మీరేమీ విచారించ కండి. మన ఖైదులో చాలామంది నేరస్థు లున్నారు. వారిని రోజుకొకరు చొప్పున బ్రహ్మరాక్షసికి ఆహారంగా పంపుతాను!" అన్నాడు మంత్రి.

అది మొదలు మంత్రిగారు రోజుకొక ఖైదీని అడవిలో ఉన్న మర్రిచెట్టు వద్దకు అన్నంతోసహా పంపటమూ, బ్రహ్మరాక్షసి ఆ ఖైదీని తినటమూ జరుగుతూ వచ్చింది.

కొంత కాలానికి ఖైదీలందరూ అయి పోయారు! ఏమి చెయ్యాలో మంత్రి గారికి పాలుపోలేదు. ఆయన రాజ్య మంతటా చాటింపు వేయించాడు:

"ఈ చెట్టు నాది. దీని నీడలోకి ఎవరైతే వస్తారో, ఈ చెట్టుకింద ఉండే నేల మీద ఎవరైతే కాలుపెడతారో వారి నెల్లా తినటానికి నాకు హక్కున్నది. నేను బ్రహ్మరాక్షసిని," అన్నదా భూతం.

రాజు దీర్ఘంగా ఆలోచించాడు. చివర కాయన బ్రహ్మరాక్షసితో, "నువు ఈనాడు మాత్రమే తిండితింటావా? లేక రోజూ నీకు ఆహారం కావాలా?" అని అడిగాడు.

"నాకు రోజూ ఆహారం కావాలి," అన్నది బ్రహ్మరాక్షసి.

"అయితే, ఈ పూట నన్ను తినటం వల్ల నీ ఆహారసమస్య తీరదు. ఈ పూటకు ఈ లేడిని తిని నన్నువదిలేశావంటే, నీకు

"ఎవరైతే అన్నం తీసుకుని అడవిలో ఉండే దయ్యాల మర్రి వద్దకు పోతారో వారికి రాజుగారు వెయ్యి రూపాయలు బహుమానం ఇస్తారు!"

ఈ చాటింపు విని సుతనుడు, "ఏమి ఆశ్చర్యం! నేను ఎంత కష్టపడి పని చేసినా రాగిడబ్బులు తప్ప కళ్ళబడవే. బ్రహ్మరాక్షసికి ఆహారమైతే ఇంత డబ్బిస్తారా?" అనుకున్నాడు.

అతను తన తల్లితో, "అమ్మా, నేను వెయ్యి రూపాయలు తీసుకుని దయ్యాల మర్రి వద్దకు అన్నం పట్టుకుపోతాను. ఆ డబ్బుతో నీకు చాలా సుఖంగా జరిగి పోతుంది!" అని చెప్పాడు.

"నా కిప్పుడేం తక్కువయిందిరా? నేను సుఖంగానే వున్నాను. నువు ఎక్కడికీ వెళ్ళనవసరం లేదులే!" అన్నది సుతనుడి తల్లి.

"నాకే అపాయమూ రాదు! నేను క్షేమంగా తిరిగి వస్తే సరిగదా!" అని సుతనుడు తల్లిని ఒప్పించి రాజువద్దకు వెళ్ళాడు.

"మహారాజా, మీ పాదరక్షలూ, గొడుగూ, కత్తి, ఒక బంగారు పాత్ర ఇప్పించినట్టయితే, నేను దయ్యాలమర్రి వద్దకు ఆహారం తీసుకు పోతాను," అని సుతనుడు రాజుగారితో అన్నాడు.



"అన్నం పట్టుకుపోవటానికి ఇవన్నీ ఎందుకు?" అని రాజుగారు అడిగాడు.

"బ్రహ్మరాక్షసిని ఓడించటానికి!" అని సుతనుడు సమాధానం చెప్పాడు.

తరవాత సుతనుడు కత్తి ధరించి, పాదరక్షలు తొడుగుకుని, గొడుగు వేసుకుని, బంగారు పాత్రలో అన్నం తీసుకుని మధ్యాహ్నానికి దయ్యాల మర్రి దగ్గిరికి వెళ్ళాడు. అతను చెట్టు నీడ లోపలికి రాక, ఎడంగా గొడుగు నీడలో నిలబడ్డాడు.

అతనికోసం చూస్తున్న బ్రహ్మరాక్షసి, "ఎండలోపడి చాలా దూరం వచ్చావు. నీడలోకి వచ్చి, విశ్రాంతి తీసుకో!" అన్నది.

"లేదు! నేను వెంటనే తిరిగి వెళ్ళాలి! ఇదుగో, నీకు ఆహారం తెచ్చాను. తీసుకో!" అంటూ సుతనుడు బంగారు పాత్రను ఎండపడే చోట నేల మీద పెట్టి, తన వెంట తెచ్చిన కత్తితో పాత్రను చెట్టు నీడలోకి తోశాడు.

సుతనుడి యుక్తి చూసి బ్రహ్మరాక్షసి మండిపడింది. "నేను ఆహారాన్నీ, ఆహారం తెచ్చినవాణ్ణీ కూడా తింటాను!" అని కోపంతో హుంకరించింది.

"నువు నన్ను మాత్రం తినలేవు. నేను నీ చెట్టు నీడలోకి రాలేదు. నన్ను తినటానికి నీకేమి అధికారం ఉన్నది?" అని అడిగాడు సుతనుడు.

"పచ్చిమోసం! నాకు నీతో ఏం పని? నేను వెళ్ళి ఆ రాజునే తినేస్తాను!" అని బ్రహ్మరాక్షసి చిందులు తొక్కింది.

"నువు ఏ జన్మలోనో మహాపాపం చేసి ఇలాటి పాపిష్ఠిజన్మ ఎత్తావు! భూతానివై ఈ మర్రిచెట్టును ఆశ్రయించావు! ఇంత నీచపు బ్రతుకు బ్రతుకుతూ ఉన్నప్పటికీ నీ కింకా బుద్ధి రాలేదా? ఇకనైనా బుద్ధి కలిగి జీవించు!" అని సుతనుడు బ్రహ్మరాక్షసిని మందలించాడు.

బ్రహ్మరాక్షసి విచారంగా, "నన్నేం చెయ్యమంటావు? ఇంతకంటె బాగా బ్రతికే మార్గం నాకెలా దొరుకుతుంది?" అని అడిగింది.

"నా వెంట వచ్చి మా నగరద్వారం వద్ద నివసించు. అక్కడికి రోజూ నీకు శుచి అయిన ఆహారం పంపే ఏర్పాటు చేస్తాను. మనుషులను పీక్కు తినే దురలవాటు మానుకో!" అన్నాడు సుతనుడు.

బ్రహ్మరాక్షసి అలాగే చేసింది.

సుతనుడు ప్రాణాలతో తిరిగి రావటం చూసి రాజు ఆశ్చర్యపోయాడు. సుతనుడు జరిగిన వృత్తాంతమంతా రాజుతో చెప్పాడు. రాజు పరమానందం చెంది, సుతనుణ్ణి తన సేనాధిపతిగా నియమించి, అతని సలహాలు తీసుకుంటూ సుఖంగా రాజ్యపాలన చేశాడు.





# స్వాతంత్ర్య సమరం

ప్రాచీనమైన సంస్కృతీ సంప్రదాయాలకు ప్రసిద్ధి గాంచిన భారతదేశాన్ని, విదేశీయులు పాలించడానికి వ్యతిరేకంగా, దేశమంతటా నూతన చైతన్యం వ్యాపించసాగింది. ఇంగ్లాండులోని భారతీయ విద్యార్థులు కొందరు, 'లోటస్ అండ్ ది డాగర్' అనే సంస్థను స్థాపించి స్వతంత్రం కోసం కృషిచేయసాగారు.

మహారాష్ట్రంలో ప్లేగువ్యాధి సంభవించినపుడు బ్రిటిష్ పోలీసులు ప్రజలను హింసించి, అవమానించడాన్ని సహించలేక తీవ్రమైన వ్యతిరేక ఉద్యమం ప్రారంభించాడు, బాలగంగాధర తిలక్ (1857 – 1920). అచిరకాలంలోనే ఆయన భారతీయుల గౌరవాదరాలకు పాత్రుడై గొప్ప నాయకుడయ్యాడు.





1906 వ సంవత్సరం సూరత్‌లో జరిగిన జాతీయ కాంగ్రెస్ మహాసభలో— సంపూర్ణ స్వయం పరిపాలనే కాంగ్రెస్ లక్ష్యంగా ప్రకటించాలని—తిలక్, అరవిందుడు కోరారు. అందుకు కొందరు నాయకులు వెనకాడడంతో, అరవిందుడి అధ్యక్షతలో విడిగా ఒక సభ జరిగింది. ఆ సభలో తిలక్ తన తీర్మానాన్ని ప్రతిపాదించాడు.



అచిరకాలంలోనే, అరవిందుడు అతివాదపక్షానికి నాయకుడయ్యాడు. బ్రిటిష్ వస్తువులను బహిష్కరించడం, పంచాయితీల ద్వారా తగాదాలను పరిష్కరించుకోవడం జాతీయ విద్యావిధానం, ప్రజాసైన్యం మొదలైన వాటిని సమకూర్చుకోవడం లాటి నినాదాలతో అరవిందుడు బ్రిటిష్ అధికారాన్ని తీవ్రంగా వ్యతిరేకించాడు. బ్రిటిష్ పోలీసులు అతివాదుల పైన దాడిజరిపి తీవ్రంగా హింసించ సాగారు.

1910 వ సంవత్సరంలో, అరవిందుడు రాజకీయరంగం వదిలి, ఆధ్యాత్మిక జీవనం చేపట్టాడు. అయినా, అంతకు ముందు ఆయన రూపొందించిన సిద్ధాంతాలు – విప్లవచైతన్యం స్వాతంత్ర్య ఉద్యమాన్ని ముందుకు నడిపించాయి. విప్లవ నాయకుడైన బాఘా జాటిన్, అతని అనుచరులూ బాలాసోర్ వద్ద బ్రిటిష్ సేనలతో పోరాడి ప్రాణాలు అర్పించారు.





కెనడాలోని పంజాబీలు, స్వతంత్ర పోరాటం కోసం ఘదర్, అనే సంస్థను ప్రారంభించారు. 372 మంది భారతీయ ప్రయాణీకులతో కోమగటమారూ అనే నౌక వాన్‌కోవర్ హార్బరును సమీపించినపుడు, అందులో ఘదర్ పక్షంవాళ్లున్నారన్న అనుమానంతో దానిని హార్బరులోకి చేరనివ్వలేదు. కలకత్తాకు తిరిగి వచ్చిన నౌక నుంచి దిగిన ప్రయాణీకులపై బ్రిటిష్ పోలీసులు కాల్పులు జరిపారు.

దక్షిణాఫ్రికాలో బ్రిటిష్ దురన్యాయాన్ని వ్యతిరేకించి పోరాడిన గాంధీజీ, 1914వ సంవత్సరంలో భారతదేశానికి తిరిగి వచ్చాడు. అహింసా మార్గంలో స్వాతంత్ర్య సిద్ధికై పోరాడే, 'సత్యాగ్రహ' విధానాన్ని గాంధీజీ ప్రవేశపెట్టాడు. బీహార్‌లోని చంపారణ్ రైతు కూలీలను సమైక్యపరిచి, అక్కడి బ్రిటిష్ నీలివర్తకుల దుండగాలను వ్యతిరేకించాడు.





స్వాతంత్ర్య ఉద్యమ నాయకులను కొందరిని ఖైదు చేసినందుకు శాంతియుతంగా నిరసన తెలియబేయాలని, 1919వ సంవత్సరం ఏప్రిల్ పదమూడున, అమృతసర్ సమీపంలోని జలియన్ వాలాబాగ్ వద్ద వేలకొలది జనం గుమిగూడారు. అక్కడి జనంలో స్త్రీలూ, శిశువులూ కూడా చాలామంది వున్నారు. అప్పుడు అమృతసర్—జనరల్ డయ్యర్ అనే బ్రిటిష్ సైన్యాధికారి పరిపాలనలో వుండేది.

అక్కడ చేరినవారికి ముందుగా సభజరపడానికి ఎలాంటి అభ్యంతరమూ తెలుపలేదు. జనరల్ డయ్యర్ ఆయుధపాణులైన తొంభైమంది సైనికులతో హఠాత్తుగా అక్కడికి వచ్చాడు. ఎలాంటి ముందు హెచ్చరికా లేకుండా కాల్పులు జరిపాడు. ఆ కాల్పుల్లో 379 మంది మరణించినట్టూ, 1208 మంది గాయపడ్డట్టూ అధికార వార్తలు తెలియజేశాయి.





జలియన్‌వాలాబాగ్ హింసాకాండ జరిగిన స్థలంలో, ప్రస్తుతం త్యాగుల స్మారక చిహ్నం వున్నది. దేశ స్వాతంత్ర్యం కోసం పోరాడిన, అన్ని మతాల, అన్ని ప్రాంతాల వేలకొలది వీరుల త్యాగ నిరతికి ఘనం చూపే గౌరవమర్యాదలకు చిహ్నంగా అది వెలుగొందు తున్నది.

తీవ్రవాదులైన స్వాతంత్ర్య యోధులు చాలామంది—ఆ రోజుల్లో అనారోగ్యకరమైన వాతావరణానికి పేరు మోసిన అండమాన్ దీవులకు తరలించబడ్డారు. వాళ్ళు అక్కడ అనేక వ్యాధులకు గురై ప్రాణాలు కోల్పోయారు.





గాంధీజీ స్వాతంత్ర్యోద్యమ నాయకుడుగా రావడంతో, పోరాటం కొత్త మలుపు తిరిగింది. ఉప్పు తయారుచేసే పేదలపై సైతం బ్రిటిష్ ప్రభుత్వం పన్ను విధించింది. గాంధీజీ ఆదేశంపై, పందలకొలది ప్రజలు ఉప్పు పన్నును వ్యతిరేకించి, పలుచోట్ల ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొని, ఖైదు చేయబడి నానా హింసలకు గురయ్యారు.



# ఎవడు సుఖి?

పూర్వం మాళవ దేశాన్ని పుష్కలుడు అనే గొప్ప రాజు ఏలుతూ ఉండేవాడు. ఆయన 'మహాభోగి' అనిపించుకున్నాడు. అందుచేత చుట్టూ చేరిన వాళ్ళంతా, "మీ ఐశ్వర్యం ముందు ఇంద్రుని ఐశ్వర్యం ఒక లెక్కలోనిది కాదు; మీ ఖజానాకూ ఆ కుబేరుని కోశాగారానికీ పోలికే లేదు. ఈ ప్రపంచంలో సుఖి ఎవరూ అంటే పుష్కల మహారాజుగారిని చెప్పి మరొకరిని చెప్పాలి!" అంటూ పొగడి, తమకు కావలసిన లాభాలు పొందుతూండే వారు. ఆ పొగడ్తలు నమ్మి "నా వంటి భోగి, సుఖీ, మరొకడు లేడు కాబోలు!" అనుకునేవాడు రాజు.

ఒకనాడు ఆస్థానానికి జ్ఞానధని అనే ఒక మహాత్ముడు వచ్చాడు. ఆయన గొప్పతనాన్ని గూర్చి పుష్కల మహారాజు ఇదివరలోనే విని ఉండటం వల్ల రావటంతోనే, "మహాత్మా, మీ రాకవల్ల మా రాజ్యం పావనమైంది!" అంటూ అర్ఘ్య పాద్యాదులు ఇచ్చి మర్యాద చేశాడు. పంచభక్ష్య పరమాన్నాలతో విందు జరిపించాడు. ఆస్థాన గాయకులను రప్పించి కచ్చేరీలు చేయించాడు. కవులను రప్పించి పద్యాలు చెప్పించాడు. నర్తకులను రప్పించి గొప్పగా నాట్యప్రదర్శన ఏర్పాటు చేశాడు.

జ్ఞానధని అంతా చూస్తూ ఊరుకున్నాడు. అందరిలాగే ఆయన కూడా తన వైభవాన్ని ప్రశంసిస్తాడనుకున్న పుష్కలమహారాజుకు, ఆయన పెదవి కదపకుండా ఉండటంతో ఉత్సాహం తగ్గినట్టయింది. ఇక ఉండబట్టలేక, "మహాత్మా, తమరు దేశదేశాలు మెట్టి వచ్చినవారుకదా. నాకన్న సుఖి ఎక్కడైనా తమకు కనపడ్డారా?" అని అడిగాడు.



అందుకు జ్ఞానధని, "మా ఊళ్ళోనే ప్రతాపుడనేవాడు ఒకడుండేవాడు. అతడు అందరికన్నా సుఖి అని చెప్పవచ్చు," అన్నాడు.

"ప్రతాపుడా? ఎవరాతడు? అతని పేరెప్పుడూ నేను విననేలేదే? అటువంటి అనామకుడొకడు నాకన్నా సుఖి అంటే ఆశ్చర్యంగా వున్నదే!" అన్నాడు రాజు.

"ప్రతాపుడు నీకు మల్లే పేరు ప్రతిష్ఠలు సంపాదించని మాట నిజమే. కాని 'సుఖి' అని మాత్రం అనిపించుకున్నాడు. కష్ట పడి సంపాదించుకుని కడుపునిండా తిన్నాడు. కొడుకులనూ, కూతుళ్ళనూ కన్నాడు. మనుమల్ని ఎత్తుకున్నాడు. ఏ ఒడుదుడుకులూ లేకుండా అరవ య్యేళ్ళు బ్రతికి, చివరికి మాతృదేశం కోసం యుద్ధం చేసి, వీరస్వర్గం పొందాడు," అని చెప్పాడు జ్ఞానధని.

"పోనీ ఆ ప్రతాపుడికి తర్వాతనైనా నేను లెక్కకొస్తానా?" అని అడిగాడు రాజు, కొంచెం ఉడుకుమోతుతనంతో.

"ఊహు. ప్రతాపుని తర్వాత వచ్చే వాళ్ళు ఇద్దరన్నదమ్ములు మా ఊళ్ళోనే ఉండేవారు. దేహదార్ఢ్యం కలవాళ్ళు, నిర్మల హృదయులు. పరోపకార పారా యణులై, మరణయాతన లేకుండా ప్రాణాలు వదిలారు," అన్నాడు జ్ఞానధని.

రాజుకు కోపం వచ్చింది. "ఏదో పెద్దవాడివికదా అన్న గౌరవం కొద్దీ అడిగితే ఇదా నువ్వు చెప్పొచ్చింది! ఆ పేదవాళ్ళా నాకన్న సుఖజీవులు?" అని గద్దించాడు.

జ్ఞానధని చిరునవ్వుతో, "రాజా, కోప మెందుకు? ఈ ఐశ్వర్యం, వైభవం ప్రస్తుతం నీకు సుఖాన్ని కలిగిస్తున్నమాట నిజమే. కాని ఏదీ శాశ్వతంకాదు. నువ్వింకా ఎంతకాలం జీవిస్తావో, చివరి వరకూ ఇలాగే ఏకటాకీని గడుస్తుందని ఏం చెప్పగలం?" అని చెప్పి తన దారిని తను వెళ్ళిపోయాడు.

"ప్రభూ, ఈ ముసలివాని గడ్డం చూసి మోసపోయి తమరు వానికి తగని మర్యా

దలు చేశారు. 'ఎద్దుకేం తెలుసు అటుకుల రుచి?' అన్నట్టు తమయొక్క వైభవం, సౌఖ్యం వీడికేం తెలుసు? సుఖి యెవరూ అంటే ముమ్మాటికీ పుష్కల మహారాజుగారే! పుష్కల మహారాజుకీ జై!" అంటూ చుట్టూ వున్న వాళ్ళంతా ఒక్కమారు ఆయనను స్తుతి చేసి సంతోషపెట్టారు. జ్ఞానధని చెప్పినది అంతా ఒక పీడ కలగా భావించి, రాజు ఆ మాటలే మరిచిపోయాడు.

సంవత్సరం గడిచింది. అంతఃపురంలో రాజు గాఢంగా నిద్రిస్తున్నాడు. "శత్రువులు! శత్రువులు!!" అన్న కేకలు వినపడ్డాయి. ఉలిక్కిపడి లేచాడు.

"ప్రభూ, సామంతరాజు మహాబలుడు సేనతో కోటను చుట్టుముట్టాడు. మనవాళ్ళు నిలబడి యుద్ధం చేస్తున్నారే కాని లాభం లేదు," అన్నారు రాజభటులు.

మరో క్షణానికి "మహాబల మహారాజుకీ జై!" అంటూ శత్రుసైనికులు కోట ప్రవేశించటం పుష్కలుడే చూశాడు.

ఇంక ఒక్క క్షణంసేపు ఉపేక్షచేసినా ప్రాణాలు దక్కవని, తన రాజదుస్తులకు మారు మామూలు దుస్తులు వేసుకొని ప్రాణం కాపాడుకోడానికని ప్రయత్నించాడు రాజు. "ఎవడో పారిపోతున్నాడు,



పట్టుకోండి!" అన్నాడు శత్రువుల తరఫు సేనాని. అతడు పుష్కలుడన్న సంగతి తెలియక ఎవడో సామాన్యుడను కొని శత్రుసైనికు డొకడు నరికెయ్యటానికే కత్తి యెత్తాడు. పుష్కలుడు, ఇంక బ్రతకటంకన్న చావటమే మేలు అనుకుని, "ఏదీ, చంపు!" అంటూ ధైర్యంగా నిలబడ్డాడు.

కాని ఆయన వెంట రెండవ కుమారుడు ఉన్నాడు. అతడు మూగవాడు. తండ్రికి రాబోతున్న అపాయాన్ని చూసి "నా తండ్రి! పుష్కల మహారాజు! చంపకండి!" అని చెప్పబోయాడు. చిత్రం! అతనికి ఆ గాభరాలో నోరు పెగిలి మాటే

వచ్చేసింది! చంపటానికి కత్తి ఎత్తిన సైనికుడు ఆగిపోయి 'పుష్కలుణ్ణి బంధించి తీసుకుపోయి, మహాబలుడి ముందు నిలబెట్టాడు.

శత్రుశేషం ఉండరాదని చెప్పి, మహాబలుడు, "కాల్చి చంపండి!" అని ఆజ్ఞాపించాడు.

ఎండిన పుల్లలు తెచ్చి చితి పేర్చారు. చితి మధ్యన పుష్కలుణ్ణి నిలబెట్టారు. అంతా చూడటానికి వచ్చారు. వాళ్ళలో పుష్కలుణ్ణి వెనక పొగడినవాళ్ళు కూడా చాలామంది వున్నారు.

పుష్కలుడు ఒక్కమారు చుట్టూ పరికించాడు. కోట, రాచనగరు, ఉద్యానవనాలు—ఒక్కొక్కటే కనపడ్డాయి. "ఇప్పుడు అవేవీ నావి కావు! ఎంతలో ఎంత మార్పు? ఇంత బతుకూ బతికి ఎటువంటి దారుణ మరణానికి పాల్పడుతున్నాను! జ్ఞానధని చెప్పిన మాటలు అక్షరాలా నిజం! 'ఏదీ శాశ్వతం కాదు. జీవితం ముగిసేవరకూ సుఖి ఎవడో, దుఃఖి ఎవడో, నిర్ణయించటానికి వీల్లేదు!' ఈ మాటలు బంగారు తునకలు." అనుకొంటూ ఆయన కంటనీరు పెట్టుకున్నాడు. ఇంతలో రాజభటులు చితికి నిప్పు అంటించారు.

దుఃఖం ఆగక, "జ్ఞానధనీ, జ్ఞానధనీ!" అని ఏడవసాగాడు రాజు. మహాబలుడికి ఇది వినపడి, "జ్ఞానధని ఎవరు?" అని అడిగాడు.

అక్కడ ఉన్నవాళ్ళు జరిగిన సంగతంతా విప్పి చెప్పారు. మహాబలుడు ఆలోచనలో పడ్డాడు. "నిజమే. చూడగా, ఎప్పటికి ఎవడిస్థితి ఎలా మారుతుందో ఎవడు చెప్పగలడు? ఈ క్షణంలో గొప్పవాణ్ణి అనుకొంటూ వున్న నాకు ముందు ముందు ఏమి రాసి పెట్టివుందో!....ఈ పుష్కలుని ప్రాణం తీయటానికి నేనెవరిని?" అనుకుని, పశ్చాత్తాపం చెందాడు.

వెంటనే మండుతున్న చితిని ఆర్పించి, పుష్కలుని ప్రాణం నిలబెట్టాడు.





# న్యాయమైన డబ్బు

కోటయ్య ఇరవైఏళ్ళ వయసువాడు. వాడికి అంతగా చదువు అబ్బలేదు. కాని, మాటతీరు మంచిది. అందుచేత ఊళ్ళో అందరూ వాడిచేతనే పనులు చేయించుకునేవారు. అయితే, వాడు మొహమాటస్థుడు కావడంతో, డబ్బు సరిగా యిచ్చేవారు కాదు. ఈ కారణం వల్ల, కోటయ్య తన అవసరాలకు చాలా ఇబ్బంది పడుతూండేవాడు.

ఆ ఊళ్ళోనే వుండే లక్ష్మి అనే అమ్మాయి మీద వాడికి అభిమానం కలిగింది. లక్ష్మి కూడా వాడంటే యిష్టమేనన్నది. కాని, లక్ష్మి తండ్రి కోటయ్యను పిలిచి, ''ఒరే, కోటయ్యా, నువు బొత్తిగా నోరులేనివాడివి. అటువంటి నువు పెళ్లాన్ని సుఖపెట్టలేవు. నీకు, కనీసం రెండెకరాల పొలమైనా వుంటేగాని, నా కూతురు నివ్వను,'' అన్నాడు.

ఇది విని కోటయ్య దిగాలుపడిపోయాడు. అప్పుడు లక్ష్మి వాణ్ణి చాటుగా పిలిచి, ''అలా బెంబేలుపడిపోకు. నువ్వంటే, మా నాన్నకు యిష్టమే. మా నాన్నకు ఒక జరీకండువా తెచ్చిచ్చావంటే చాలు, మన పెళ్ళికి ఒప్పుకుంటాడు,'' అని చెప్పింది.

కోటయ్య వెంటనే ఊరి షాహుకారు ఇంటికి వెళ్ళి, తన కొక జరీకండువా కావాలని అడిగాడు.

''అలాగే కండువా యిస్తాను. నాలుగు వెండి కాసులు తీసుకురా,'' అన్నాడు షాహుకారు నిర్మొహమాటంగా.

లోగడ కోటయ్య, షాహుకారుకు ఎన్నో పనులు చేసి పెట్టాడు. షాహుకారు వాడికి సరిగా డబ్బివ్వలేదు. కాని, వాడివాళ ఒక జరీకండువా కావాలనేసరికి డబ్బు తెమ్మన్నాడు.

"వసుంధర"



పడి, "చాలా కాలానికి నా కోరిక తీరింది. నీకూ్కడా ఏదైనా కోరిక వుంటే చెప్పు; తీరుస్తాను," అన్నాడు.

"లక్ష్మిని, నా కిచ్చి పెళ్ళి చెయ్యి." అన్నాడు కోటయ్య.

వెంటనే లక్ష్మి తండ్రి, "నీ మనసు మంచిది. నా మనసును యింతగా సంతోషపెట్టిన నీకు, దేవుడు తప్పక మేలు చేస్తాడు. నిన్ను పెళ్ళాడితే, నా కూతురు సుఖపడుతుంది. రేపే మీ పెళ్లి జరిపిస్తాను," అన్నాడు.

అయితే, యీలోగా ఒక విచిత్రం జరిగింది.

కోటయ్య మారుమాట్లాడకుండా అక్కణ్ణించి వెళ్ళి, ఊళ్ళో ఒకొ్కక్కరినీ తనకు నాలుగు వెండి కానులు కావాలని అడిగాడు. ఒక్కరు కూడా, ఉదారబుద్ధి చూపలేదు. కోటయ్య నిరుత్సాహపడినా, ఆ రోజు నుంచీ మరింత కష్టపడి—సరిగ్గా తిండి కూడా తినకుండా, రెండు వారాలు గడిచేంతలో నాలుగు వెండికానులు కూడ బెట్టగలిగాడు.

తరవాత వాడు ఆ డబ్బు తీసుకుని షాహుకారింటికి వెళ్ళి, డబ్బు చెల్లించి జరీకండువా తీసుకున్నాడు. వాడు ఆ కండువాతో లక్ష్మి ఇంటికి వెళ్ళగానే, లక్ష్మి తండ్రి దాన్ని చూసి ఎంతో ఆనంద

కోటయ్యకు జరీకండువా అమ్మిన షాహుకారు కొడుకు్క, కొద్ది రోజులుగా జబ్బుగా వున్నది. వ్యాధి ఏమిటో ఎవరికీ అంతుపట్టలేదు. వైద్యులవల్ల పని జరగడం లేదని, షాహుకారు ఒక సాధువు దగ్గిరకు వెళ్ళాడు.

సాధువు, షాహుకారు కొడుకును చూసి, షాహుకారుతో, "నువ్వు చేసిన పాపాలే, నీ కొడుకును వ్యాధి రూపంలో బాధిస్తున్నవి. దీనికి నేను మందు యిస్తాను. అందుకుగాను నువ్వు, నాకు డబ్బివ్వాలి," అన్నాడు.

షాహుకారు మారుపలకు్కండా అందుకు ఒప్పుకున్నాడు. సాధువు

అప్పటి కప్పుడే అతని కొడుక్కు మందిచ్చాడు. షాహుకారు, అన్నప్రకారం సాధువుకు డబ్బిచ్చాడు. కాని, వారం గడిచినా షాహుకారు కొడుకు వ్యాధి తిరుగుముఖం పట్టలేదు. ఇది చూసి సాధువుకు చాలా ఆశ్చర్యం కలిగింది. షాహుకారు తన కొడుకు పరిస్థితికి దిగులు పడసాగాడు.

"నీ డబ్బు న్యాయంగా సంపాయించింది కాదు. అందుకే, నా మందు పని చేయుడం లేదు," అన్నాడు సాధువు.

"నేనేం చేయాలి, స్వామీ?" అన్నాడు షాహుకారు దిగులుగా.

"న్యాయమైన సంపాదనకే, నా మందు ఫలితం యిస్తుంది. నువ్వు షాహుకారువు గదా! రోజూ ఎందరో నీకు డబ్బు తెచ్చి యిస్తూంటారు. అలా యిచ్చిన వాళ్ళ పేర్లు గుర్తుంచుకుని, డబ్బు నాకు యిస్తూండు. న్యాయమైన సంపాదన, నా చేతిలో పడగానే, నీ కొడుక్కు వెంటనే జబ్బు నయమైపోతుంది," అన్నాడు సాధువు.

షాహుకారు అలాగే చేయసాగాడు. అతను కోటయ్య యిచ్చిన నాలుగు వెండి కాసులూ సాధువుకు యివ్వగానే, అంతవరకూ మైకంలో వున్న కొడుకు చటుక్కున లేచి కూర్చున్నాడు.

"ఇదే న్యాయమైన డబ్బు! నువ్వు ఎవరిదగ్గిరైతే దీన్ని తీసుకున్నావో, అతడికి వెంటనే తిరిగి యిచ్చెయ్యి. మరెవరికైనా





వీణ్ణి జబ్బు రూపంలో బాధిస్తున్నవి. నీ ఇంట్లో న్యాయమైన డబ్బు వుంటే, నేనిచ్చేమందు పని చేస్తుంది!'' అని కరణం కొడుకు నోట్లో ఏదో భస్మం వేశాడు.

కరణం ఆయనకు పది వరహా లిచ్చాడు. కాని, కరణం కొడుకు అలాగే మైకంలో పడివున్నాడు.

''ఈ ఊళ్ళో ఎవరివద్దా న్యాయమైన డబ్బు వున్నట్టులేదు! ఇది చాలా విచార పడవలసిన విషయం,'' అన్నాడు సాధువు.

''షాహుకారు కొడుకు జబ్బు, కోటయ్య డబ్బుతో నయమయింది కదా! నేనూ వాడి దగ్గరకువెళ్ళి, ఆడబ్బుతీసుకునివస్తాను,'' అన్నాడు కరణం బయలుదేరపోతూ.

సాధువు ఆయన్ను ఆగమని, ''నేను చెప్పేది జాగ్రత్తగా విను. కోటయ్య షాహుకారుకు నాలుగు వెండి కాసు లిచ్చాడు. అవి న్యాయమైనవే అనడంలో సందేహం లేదు. కాని, షాహుకారు వాటిని కోటయ్యకు బహుమానంగా యిచ్చేశాడు. అందువల్ల, అది యిప్పుడు న్యాయమైన డబ్బు కాదు! కోటయ్య దగ్గిర యింకేమైనా డబ్బుంటే, అది తీసుకురా,'' అన్నాడు.

కరణం కోటయ్య ఇంటికి వెళ్ళి, సాధువు చెప్పింది వాడికి చెప్పాడు. కోటయ్య విచారంగా, ''అయ్యా, నేనేం

ఉపయోగపడుతుంది,'' అన్నాడు సాధువు.

షాహుకారు వెంటనే, ఆ నాలుగు వెండి కాసులూ కోటయ్య ఇంటికి పంపే శాడు. ఈలోగా అతడి ఇంటికి గ్రామ కరణం వచ్చాడు. ఆయన కొడుక్కూ ఏదో జబ్బు చేసింది. షాహుకారు, సాధువు నెవర్నో పిలుచుకు వచ్చాడని తెలిసి, కరణం చూడడానికి వచ్చాడు. షాహు కారు కొడుకు జబ్బు నయమవడం చూసి, కరణం సాధువును తన ఇంటికి రావల సిందిగా కోరాడు.

సాధువు కరణం ఇంటికి వెళ్ళి, ఆయన కొడుకును చూసి, ''నీ పాపాలే

చేసేది! నా దగ్గిర, యీ నాలుగు వెండి కాసులూ తప్ప, మరేం డబ్బు లేదు.'' అన్నాడు.

చేసేదిలేక కరణం, కోటయ్య యిచ్చిన ఆ నాలుగు వెండి కాసులే తీసుకుని, సాధువుకు జరిగినదేమిటో చెప్పకుండా— ఆయనకిచ్చాడు.

సాధువు చేతిలో, ఆ డబ్బు పడగానే కరణం కొడుకు మంచం మీద లేచి కూర్చున్నాడు. వాడి జబ్బు చేత్తో తీసేసినట్టు మాయమైంది.

కరణం ఆశ్చర్యపోయి సాధువుతో, ''స్వామీ, కోటయ్య డబ్బులో ఏదో మహిమ వుండి వుండాలి! వాడి దగ్గిర యింకే డబ్బూ లేదంటే, షాహుకారు వాడికి తిరిగి యిచ్చిన డబ్బే తెచ్చి, మీకిచ్చాను.'' అన్నాడు.

ఇది విన్న సాధువు కోపంగా, ''అంటే దీని అర్థం—షాహుకారు యీ డబ్బును న్యాయంగానే కోటయ్యకు యివ్వవలసి వున్నదన్నమాట. నేనేదో ధర్మబుద్ధికొద్దీ బహుమానంగా యిచ్చాడనుకున్నాను! అన్యాయంగా మరొకరి డబ్బు తమవద్ద వుంచుకునే వాళ్ళందరికీ, యిలాగే జబ్బులు చేస్తూంటాయి. న్యాయమైన సంపాదన మాత్రమే, వాళ్ళను కాపాడగలదు!'' అని వెళ్ళిపోయాడు.

సాధువు చేసిన హెచ్చరిక కరణం ద్వారా ఊళ్ళో అందరికీ తెలిసింది. వాళ్ళల్లో ప్రతి ఒక్కడూ కోటయ్య చేత అంతో యింతో పని చేయించుకుని, వాడికి సరిగా డబ్బివ్వనివాళ్ళే. ఆ కారణం వల్ల, ఊరివాళ్ళంతా కూడ బలుక్కుని కోటయ్యకు ఒక ఇల్లూ, రెండెకరాల పొలం కొనిపెట్టారు. కోటయ్య, లక్ష్మిని వివాహం చేసుకుని, కష్టపడి వ్యవసాయం చేస్తూ సుఖంగా బతికాడు.

న్యాయమైన సంపాదన మహిమను కళ్ళారా చూసి వుండడం వల్ల, తరవాత ఊరి ప్రజలందరూ న్యాయమార్గాన బతుకుతూ, ఏ జబ్బులబాధా లేకుండా హాయిగావున్నారు.





# కమలమ్మ ఆదా

కమలమ్మా, ఆమె భర్త నారాయణా బంధువుల ఇంట్లో శుభకార్యానికి పొరుగూరు వెళ్ళారు. వాళ్లు తిరిగివచ్చే రోజున, ఆ ఊళ్లో సంత జరుగుతున్నది. సంతలో రకరకాల అరటిగెలలు చౌకగా అమ్ముతున్నారు. అంత చౌకగా దొరుకుతున్న అరటిగెలలను కొని తీరాలనుకున్నది, కమలమ్మ.

ఆమె భర్తతో, "ఇక్కడ సంతలో అరటి గెలలు కారుచౌక. మనం కూడా ఒక గెల కొనుక్కొని ఇంటికి పట్టుకుపోదాం," అన్నది.

"మొత్తం గెల ఏం చేసుకునేట్టు? మనకు పిల్లా పీచా!" అన్నాడు నారాయణ విసుక్కుంటూ.

"దోరగా వున్న గెల కొనుక్కుంటే, పదిహేను రోజులు నిలవ వుంటుంది. ఇక్కడ నాలుగు రూపాయలకు దొరుకుతున్న గెల, మన ఊళ్ళో పది రూపాయిలకైనా దొరకదు. ఎంత ఆదా అవుతుందో మీరే ఆలోచించి చూడండి!" అన్నది కమలమ్మ.

సరే అని, నారాయణ కమలమ్మ కొన్న గెల భుజాని కెత్తుకున్నాడు. కాని, ఆదా మాట ఎలా వున్నా, దాన్ని మోయడం అతడికి చాలా కష్టమనిపించింది. దాన్ని మార్గ మధ్యంలో భుజం మీంచి దించి కిందపెట్టాడు.

భర్త అరటి గెలను అలా సగం దూరం మోసుకొచ్చినందుకు, కమలమ్మకు చెప్పలేనంత సంతోషం కలిగింది. అలా కాకపోతే, సంత నుంచి తమ ఊరుకు అరటి గెల మోసుకు రావడానికి కూలివాడు రెండు రూపాయలడిగేవాడు. ఇప్పుడిక ఒక్క రూపాయి ఖర్చుతో, గెల ఇంటికి చేరిపోతుంది!

కుప్పాల వెంకటసుబ్బారావు

అక్కడ దారిలో కనిపించిన కూలి వాడికి రూపాయి యిచ్చి, వాళ్ళు గెలను ఇంటికి చేర్పించారు. ఇలా కూలిడబ్బుల్లో, సగానికి సగం అదా అయినందుకు కమలమ్మకు ఎక్కడలేని ఆనందం కలిగింది.

ఆ మరసటిరోజు నుంచీ గెలలోని అరటికాయలు, పండడం మొదలు పెట్టాయి. బాగా రుచిగా వున్నందున భార్యాభర్తలు వాటిని తినసాగారు. అయితే, ఎక్కువగా తింటున్నందున వాళ్ళకు ఆకలి మందగించింది.

కమలమ్మ భర్తతో, "చూశారా, ఈ అరటిపండ్ల వల్ల, మన భోజనం ఖర్చుల్లో కూడా ఆదా కనిపిస్తున్నది!" అన్నది.

అరటిపళ్ళతో మొహం మొత్తిన నారాయణ, "అయిన అదా చాలు. ఇక మిగిలిన పళ్ళు, ఇరుగు పొరుగు ఇళ్ళ వాళ్ళకు యిచ్చెయ్యి." అన్నాడు.

ఇందుకు కమలమ్మ ఒప్పుకోలేదు. అంతదూరం నుంచి చౌకగా తెచ్చింది, పరాయి వాళ్ళకు దానం చేయడానికా, అన్నదామె.

మరి కొద్దిరోజులకు గెలలో మిగిలి వున్న పళ్ళన్నీ ఒక్కసారే పండి పోయాయి. రెండు పూటలా భోజనానికి బదులు, అరటిపళ్ళే తిందామన్నది కమలమ్మ, భర్తతో. ఆమెకు గెలలోని ఒక్క పండు కూడా వృథా కావడం యిష్టంలేదు.



ఆమె చెప్పినట్టే, మూడు రోజులపాటు వాళ్ళు భోజనానికి బదులు అరటిపళ్ళు తిన్నారు. దానితో గెలలోని పళ్ళన్నీ అయిపోయాయి.

పోతే, యిప్పుడు వాళ్ళకు విపరీతమైన అజీర్తి, కడుపునొప్పి జబ్బులు పట్టుకున్నవి.

"చూశావా, నీ ఆదా ఎంత చేసిందో! ఇప్పుడు వైద్యుడికీ, మందులకూ అయ్యే ఖర్చు, నువు చేసిన ఆదాకు మించిపోతుంది," అన్నాడు నారాయణ.

"ఆ మాట నిజమే! ఇందుకు విరుగుడు ఒక్కటే. ఈ అజీర్తి తగ్గేదాకా మనం పస్తులుండడం," అన్నది కమలమ్మ.

అందుకు నారాయణ ఒప్పుకోక, "పస్తులతో నీరసం పట్టుకుని, అంతకంత ఖర్చవుతుంది. అయినా, ఈ కడుపునొప్పి నేను భరించలేను," అంటూ వైద్యుడి దగ్గిరకు వెళ్ళాడు.

వైద్యుడు రెండు రూపాయిలు పుచ్చుకుని, కొన్ని గుళికలిచ్చి, పూటకు రెండు చొప్పున వాడమన్నాడు. నారాయణ వాటిని ఇంటికి తెచ్చి, భార్యకు సంగతి చెప్పాడు.

రెండు రోజుల్లో నారాయణ కడుపు బాధ తగ్గిపోయింది; కాని కమలమ్మకు యింకా ఎక్కువయింది.

ఆదా చేయడం బాగా అలవాటయిన కమలమ్మ, వైద్యుడు చెప్పినట్టు పూటకు రెండు గుళికలు కాక, ఒక్కటే వేసుకుంటున్నందువల్ల, ఆమెకు యీ చిక్కు వచ్చింది.

నారాయణ వైద్యుణ్ణి ఇంటికి తీసుకు వచ్చాడు. ఆయన కమలమ్మ చేసిన పనికి నవ్వుకుని, మరికొన్ని గుళికలు యిస్తూ, "వీటిని ఉచితంగా యిస్తున్నాను. చెప్పినట్టు వాడితే, నీ జబ్బు నయమైపోతుంది," అన్నాడు.

అయితే, రెండోసారి కూడా వైద్యుడికి, నారాయణ కొంత డబ్బు ముట్టచెప్పిన సంగతి, ఆ ఇద్దరూ కమలమ్మకు చెప్పకుండా రహస్యంగా వుంచారు.





# చిత్ర కథ

బుద్ధుని ఆగమనానికి కపిలవస్తునగరం స్వాగతశోభతో వెల్లివిరిసింది. ప్రపంచానికి జ్యోతిగా నిలిచిన బుద్ధదేవుడు తమ నగరానికి చెందినవాడైనందుకు పౌరులు పొందుతున్న ఆనందానికి అవధులు లేవు. తమకు ఏలికకావలసిన సిద్ధార్థ రాకుమారుడు, సర్వమానవాళి మానవతకు చక్రవర్తి అయినందుకు పొంగి పోతూన్న నిండు హృదయాలతో దారి పొడవునా పువ్వులు పేర్చారు.

కుమారుణ్ణి ఆలింగనం చేసుకోవడానికి వృద్ధుడైన శుద్ధోదన మహారాజు పితృ హృదయం తహతహలాడుతున్నది.

బుద్ధుడు వస్తున్నాడు. అర్ధనిమీలిత నేత్రాలతో, శిరమువంచని గంభీరగమనంతో, నిశ్చల శాంతవదనంతో కరుణా మూర్తిగా వస్తున్న అతని వెనుక, ''బుద్ధం శరణం గచ్ఛామి, ధర్మం శరణం గచ్ఛామి, సంఘం శరణం గచ్ఛామి'' అనే వాక్యాలతో అసంఖ్యాక జనసందోహం చేస్తున్న ధ్యానం, గంభీర సముద్ర ఘోషలా వినవస్తున్నది.

యశోధర, రాహులుడు, శుద్ధోదనుడు రాజప్రాసాదం సోపానాలు దిగి ఎదురు చూస్తున్నారు. చెన్నుడు ప్రాంగణం ముందుకొచ్చి నిల్చుని ఆనందాశ్రువులు రాల్చుతూ ఎదురు చూస్తున్నాడు.

బుద్ధుడు భిక్షాపాత్ర పట్టుకొని రాజ ప్రాసాదాన్ని చేరుకున్నాడు. రాహులుడు పరుగున వెళ్ళి తండ్రి పాదాలపై మోక



రిల్లాడు. యశోధర చిరకాలానికి కనిపించిన భర్త ప్రసన్నవదనాన్ని తదేకంగా చూస్తూ, అలాగే అతని ముందు మోకరిల్లింది. అతని పాదాలపై తలవాల్చి కన్నులతో అద్దుకొన్నది. ఆమె కళ్ళలోని మంచి ముత్యాల్లాంటి బాష్పజలం బుద్ధుని పాదాలను కడిగింది.

బుద్ధుణ్ణి ఆలింగనం చేసుకోవాలని చేతులు చాచివచ్చిన శుద్ధోదనుడు, అతని పరివ్రాజకరూపాన్నీ, భిక్షాపాత్రనూ చూసి అలాగే మతిపోయి నిశ్చేష్టుడైపోయాడు. ఆ వృద్ధరాజు మనస్సు భిక్షువుగా వచ్చిన కుమారుణ్ణి చూసి విలవిలలాడిపోయింది, కన్నీరు కారింది. ఆలింగనానికి చాపిన చేతులు చలనం లేకుండా అలాగే ఆగిపోయాయి.

"నాయనా! రాకుమారా! సిద్ధార్థా! గౌతమా! కుమారా! ఏమిటిది? ఏమిటిది?" అంటూ శుద్ధోదనుడు పిచ్చివాడిలాగ ఎలుగెత్తి వాపోతూ అలాగే కూలబడిపోయాడు, మూర్ఛపోయాడు.

బుద్ధుడు తండ్రి తలను ఒడిలో పెట్టుకొని, తన కాషాయ ఉత్తరీయంతో వీవన విసిరాడు. కుమారునిస్పర్శతో శుద్ధోదనుడు తెప్పరిల్లాడు. "తండ్రీ! ప్రణామములు! నేను సిద్ధించిన అర్థముగలవాడిగా సిద్ధార్థుడినై వచ్చాను!" అని అంటున్న బుద్ధుని మాటలు అమృతంలాగ వినిపించాయి. అతని అరమోడ్పు కన్నులు వెన్నెల జల్లుతున్నవి. బుద్ధుని ముఖంలో దివ్యతేజస్సు కనిపించింది. అనిర్వచనీయమైన ప్రభావమేదో శుద్ధోదనుణ్ణి ఉత్తేజితుణ్ణి చేసింది. అశాంతి నుండి శాంతికి, చీకటి నుండి వెలుగుకు, భ్రమ నుండి సత్యానికి తీసుకువెళ్ళింది. బుద్ధం శరణం గచ్ఛామి! అనే మాటలు చెవుల్లో మారుమ్రోగుతున్నాయి. శుద్ధోదనుడు అదే అంటున్నాడు. రాహులుడు కూడా అలాగే పలుకుతున్నాడు. ప్రజానీకం అలాగే ఘోషిస్తున్నది. యశోధర కన్నులు మూసుకొని; గుండెపై చేతులుంచుకొని

ధ్యానముద్రలో 'బుద్ధం శరణం గచ్ఛామి' అని జపిస్తున్నది.

అప్పుడు బుద్ధుడు రాహులుడి తల నిమిరి, "కుమారా! నీవు కూడా బుద్ధుడివై ధర్మాన్ని, సంఘాన్ని అనుసరిస్తూ మానవతకు సార్థకత చేకూరుస్తావని ఆశీర్వదిస్తున్నాను! బుద్ధుడంటే ఎవరో తెలుసా? నీవనుకున్నట్లుగా, నేను మాత్రమే బుద్ధుడిని కాను! ఉత్తమ ధర్మాలను, అహింసను ఆచరించే వారందరూ బుద్ధులే! బుద్ధత్వమే మానవత్వం! బుద్ధత్వం పొందిన మానవుడే బుద్ధుడు. అటువంటి మానవజన్మను సార్థకం చేసుకున్న బుద్ధుడే యీ లోకానికి కావలసినవాడు, జీవకోటికి శరణ్యం! బుద్ధులు ఉపదేశించిన ధర్మాలే మానవాళికి నిజమైన శాంతినిస్తాయి. ధర్మమే లోకానికి శరణ్యం! బుద్ధులతో కూడిన సంఘమే యీ జగత్తుకు శరణ్యం!" అని చెప్పాడు.

యశోధర కనులు విప్పి బుద్ధుణ్ణి నిశ్చలంగా చూస్తూ, "స్వామీ! నన్ను మీకు భిక్షగా సమర్పించుకుంటున్నాను. ఇంత వరకు నేను గృహిణిని. ఇప్పుడు నేను మానవసేవా ధర్మానికి అంకితమౌతున్న పరివ్రాజికను. మీ అడుగు జాడల్లోనే జీవించడం నా ధర్మం. స్త్రీలకు బౌద్ధ



సంఘంలో అర్హతను, స్థానాన్ని ప్రసాదించండి!" అని అర్థిస్తూ భక్తితో ప్రణమిల్లింది.

ఆ విధంగా యశోధర బౌద్ధధర్మాన్ని స్వీకరించిన మొదటి మహిళ అయింది.

ఆనందబాష్పాలు కార్చుతూ, తనను ఒక పెన్నిధిగా, దేవుడిగా ఆరాధనా భావంతో చేతులు జోడించి ఉన్న చెన్నుడిని బుద్ధుడు చూసి ఆప్యాయంగా దగ్గరకు తీసుకుంటూండగా, చెన్నుడు నమస్కరించబోతూంటే వారిస్తూ బుద్ధుడు, "చెన్నా! ఎంత గొప్పవారైపోయినప్పటికీ పిన్నలే పెద్దలను గౌరవించాలి, పూజించాలి. నువ్వు నాకు



యిప్పటికీ పూజనీయుడివి. నన్ను యీ కపిలవస్తు నుండి విశాల విశ్వంలోకి దాటించిన పుణ్యమూర్తివి కదా! నేను తెలుసుకొన్న సత్యాల్ని, ధర్మాన్ని చెప్పినంత మాత్రాన నన్ను భగవానుడని అనుకోవడం గాని, భగవానుడని ఆరాధించడం గాని, నేను యిష్టపడను. వ్యక్తి ఆరాధన అనవసరమైనది. భగవానుడనే భావన కూడా అంతే! మానవ ధర్మాన్ని ఆచరించడమే కావలసినది!" అన్నాడు.

బుద్ధుని మాటలకు చెన్నుడు అర్థిస్తున్నట్లుగా, "బుద్ధభగవానుడు"—అని అనుకోవడంలోనే మాకు ఎంతో తృప్తి. ధర్మాచరణపట్ల, సంఘసేవపట్ల అకుంఠిత భక్తి విశ్వాసాలు కలుగుతున్నవి. బలమైన అనుబంధాన్ని నిలుపుతున్నవి. కనుక, నిన్ను భగవానుడని ఆరాధనా భావంతో చూసుకోవడానికి, పిలుచుకోవడానికి మాకు గల స్వేచ్ఛను కాదనక అలాగే ఉండనియ్యి!" అన్నాడు.

అప్పట్నించి బుద్ధుడు బుద్ధభగవానుడుగా పిలువబడ్డాడు. బుద్ధదేవుడనిపించుకున్నాడు. ఉత్తమ మానవుడే దేవుడు! అనే అర్థంగా బుద్ధుడు దానికి తటస్థంగా ఊరుకున్నాడు.

శాక్య వంశంలో కొద్దిమంది తప్ప అందరూ బౌద్ధ ధర్మాన్ని స్వీకరించారు. బుద్ధుని ఆదేశాలను, ఉపదేశాలను ప్రచారం చేశారు, భిక్షువులుగా మారారు. సంపదలను సంఘానికి అర్పించారు. సేవకు అంకితమయ్యారు.

తొలినుంచీ ప్రత్యర్థిగా ఉన్న దేవదత్తుడు మాత్రం స్పర్థతో బౌద్ధధర్మాన్ని నిరసిస్తూ, బుద్ధుని మార్గానికి వ్యతిరేకులైన వారిని కూడగట్టుకొని వెళ్ళాడు.

కపిలవస్తు నగరం నుండి బుద్ధుడు తిరిగి ప్రయాణమయ్యాడు. అతని అనుయాయులతో, శిష్యులతో బాటు యశోధర, రాహులుడు కూడా వెంట వెళ్ళారు.

ఆ తిరుగు ప్రయాణంలో బుద్ధుడు సుజాత ఇంటికి భిక్షువుగా వెళ్ళాడు.

సుజాత కుమారుణ్ణి ఆశీర్వదించి బుద్ధుడు రాహులుడితో, "రాహులా! ఈ సుజాతుడు నీకు తమ్ముడు. మీరు స్నేహితులై, ఆప్తులై, సోదరులై వర్ణవిభేదాలకు అతీతమైన మానవత్వాన్ని, వసుధైక కుటుంబాన్ని ప్రపంచానికి ప్రబోధించండి!" అని చెప్పాడు.

సుజాత బుద్ధుని శిష్యురాలిగా యశోధరకు తోడు కలిసింది. గృహిణులుగా ఉంటూనే స్త్రీలు బౌద్ధ ధర్మాన్ని అవలంబించి, పిల్లలను ఉత్తమ మానవులుగా తీర్చిదిద్దే మాతృమూర్తులై ఉండాలని నారీ లోకానికి బోధించి ధర్మసంచాలనం చేయవలసిందని యశోధర, సుజాతలకు ఆదేశించాడు.

బుద్ధుడు తన అనువర్తులైన శిష్యులందర్నీ ధర్మచక్ర సంచాలనకు నలు దిక్కులకూ పంపించి, యశోధరను, రాహుల్ణి కపిలవస్తు నగరానికి వెళ్ళి వృద్ధుడైన శుద్ధోదనుడిని కనిపెట్టుకొని, శాక్యవంశాన్ని ధర్మమార్గాన నడపమని చెప్పి పంపాడు.

బుద్ధుడు ఒంటరిగా అరణ్యమార్గం పట్టాడు. ఘోరారణ్యంలో, ఘోరాతిఘోరుడై, క్రూరత్వానికి మారుపేరైన 'అంగుళిమాలి' అనే దోపిడి దొంగ ఉన్నాడు. మనుష్యుల చేతిబొటనవ్రేళ్లు



దండగా గుచ్చి మెడలో వేసుకున్నాడు. ఆ బొటనవ్రేళ్ళు అతనికి భయపడి దాసోహం అని ప్రాణాలు దక్కించుకొన్నవారివీ, అతనిచేత చంపబడిన వారివీను.

తనకు భయపడనివాడంటూ యీ భూమ్మీద ఉండలేడనిపించుకోవాలని అంగుళిమాలి ఉద్దేశం.

దారిలో కొందరు గొర్రెల కాపరులు బుద్ధుణ్ణి చూసి, "స్వామీ! అటుగా వెళుతున్నారా? ఆ దారిన నలభైయాభై మందికి తక్కువ సంఖ్యలో వెళ్ళడానికి ఎవరూ సాహసించరు. అక్కడ అతి భయంకరుడైన గజదొంగ ఉన్నాడు.



ఒంటరిగా చిక్కినవారందరి ప్రాణాలూ తీస్తాడు!" అన్నారు.

కాని బుద్ధుడు ఆ గొర్రెల కాపరుల హెచ్చరికలు లక్ష్యపెట్టకుండా అరణ్యంలో ముందుకు నడిచాడు.

ఒంటరిగా ఎదురుగా వస్తున్న బుద్ధుణ్ణి అంగుళిమాలి దూరంనుంచి చూశాడు. కాషాయవస్త్రం కప్పి అతడేదో దాస్తున్నాడు.

అంగుళిమాలి భయంకరమైన రక్తపు మరకలతో తళతళ మెరుస్తున్న తన పెద్ద కత్తిని ఎత్తి ఝుళిపిస్తూ, "ఎవర్నువ్వు? ఏమిటో దాస్తున్నావు. దాన్నిలా యివ్వు!" అని ఆజ్ఞాపించాడు.

బుద్ధుడు చిరునవ్వుతో కావిగుడ్డ మాటున దాచిన భిక్షాపాత్రను తీసి అంగుళిమాలికి యిచ్చాడు.

అంగుళిమాలి దాన్ని పట్టుకొని తిప్పి తిప్పి చూసి, "భిక్షాపాత్ర! నీవు బిచ్చగాడివైతే అయ్యావుగాని, నన్ను వెతుక్కుంటూ వస్తున్నట్లుగా వచ్చి, ఎదురు నిల్చి చిరునవ్వు చిందిస్తూ, నా చేతికి ఒట్టి చిప్ప అందించడానికి నీకెన్ని గుండెలు! నీకు భయం లేదా? నేనెవర్నో తెలుసా?" అన్నాడు.

"నువ్వు మనిషివి. నేను మనిషిని. ఎందుకు భయపడాలి?" అన్నాడు బుద్ధుడు.

"నువ్వు నాకు భయపడి, బుద్ధిగా నీ బొటన వ్రేలు యిచ్చి ప్రాణాలు దక్కించుకొని ఇక్కడి నుంచి వెళ్ళు; లేదా ఇప్పుడే నిన్ను చంపుతాను; తర్వాత నీ బొటనవేలు తీసుకొని మాలలో కలుపుతాను!" అన్నాడు దొంగ.

"నువ్వు నన్ను చంపుతావు, అంతే కద! ఎపుడో ఒకప్పుడు, ఏదో ఒకలాగ చావు తప్పదుకదా! చంపు, సంతోషంగా చావడానికి యిష్టపడుతున్నాను. ఈ రోజు నన్ను చంపుతావు, రేపు నువ్వు చస్తావు. నాలాగ నిశ్చింతగా నవ్వుతూ మృత్యువును స్వీకరించగలవా? నేను ఏ ప్రాణికీ హాని

కలిగించలేదు, అనే తృప్తితో ఆనందంగా, నీ కత్తికి తల ఒగ్గగలను. నీకు చావు దగ్గిర పడినప్పుడు, నాలాగ ఆనందంగా ఉండగలవా? చెప్పు!...'' అన్నాడు బుద్ధుడు.

ఆ మాటలతో అంగుళిమాలి తల తిరిగి పోయింది. ఆలోచనలో పడ్డాడు. తాను చేసిన ఘోరాలన్నీ తలచుకొని భయంతో కంపించి పోయాడు. తన పాపానికి ప్రాయశ్చిత్తం లేదు! మహాపాపి అయిన తనను క్షమించగలవాడు ఎవడు? ఎవడా దయాళువు? దొంగకు ఆవేదనలో బుద్ధుడు స్ఫురించాడు. అదివరకు బుద్ధుడి గురించి ఎంతో విన్నాడు. పులిని, లేడిని, పామును, కప్పను ఒకేలాగ చూసే కరుణామూర్తి అని విన్నాడు. ఆ బుద్ధుడే తనకు దిక్కు! అనుకొంటూ 'బుద్ధం శరణం గచ్ఛామి!' అని తనలో అనుకుంటున్నట్లుగా పలికాడు!

''అంగుళిమాలీ! నేనే ఆ బుద్ధుణ్ణి! నీ కోసమే వచ్చాను. అందుకే, నీకు భిక్షాపాత్రను అందించాను. గత జీవితాన్ని మరిచిపో! బౌద్ధ భిక్షువుగా నా శిష్యుడుగా నాతో రా! పద పోదాం!'' అన్నాడు బుద్ధుడు.

"బుద్ధభగవానుడా!" అంటూ అంగుళిమాలి బుద్ధుడి పాదాలపై పడి, ''నేనొక్కడినే బాగు చూసుకోవడం సరి కాదు. నా అనుచరులందరూ నీ శిష్యులు-భిక్షువులు!'' అంటూ అంగుళిమాలి తన వారినందరినీ పిలిచి, తనలాగే అందరినీ అనుగ్రహించవలసిందని బుద్ధుణ్ణి వేడుకున్నాడు.

అంగుళిమాలి, అతని అనుచరులు పలువురు బౌద్ధ భిక్షువులై బుద్ధుని వెంట వెళ్ళారు.

బుద్ధుని ఉపదేశాలను విని ఎందరెందరో అధర్మపరులు, దుర్మార్గులు తమ గతాన్ని ఏవగించుకుని పశ్చాత్తాప్తులై బుద్ధుని శిష్యులై, భిక్షువులై, సంఘసేవకు అంకితమై, శేషజీవితాల్ని పునీతం చేసుకున్నారు.



# వృత్తిధర్మం

శివపురం అనే గ్రామంలో రామనాధుడనే వైద్యుడుండేవాడు. ఆయన పేదసాదలకు ఉచితంగా వైద్యం చేసేవాడు. కాస్త కలిగినవాళ్ళు ఏమైనా ఇస్తే తీసుకునేవాడు. పేదవాళ్ళెవరైనా, తమ శక్తికి మించి డబ్బిస్తున్నారని తెలిస్తే, వాళ్ళను గట్టిగా మందలించేవాడు.

ఒక రాత్రి ఆయన బాగా నిద్రలో వుండగా, వీధి తలుపు చప్పుడయింది. ఆయన వెళ్ళి తలుపు తెరిచాడు. వాకిట్లో ఒక యువకుడూ, ముసలివాడూ నిలబడి వున్నారు. యువకుడిది పక్క గ్రామం. అతడి చెల్లెలు కడుపునొప్పితో బాధపడుతున్నది. ముసలివాడిది శివపురమే. అతడి మనమరాలు విషజ్వరంతో అవస్థపడుతున్నది.

"మీ ఇద్దరిలో చేసిన వైద్యానికి ఎవరు డబ్బుయివ్వగల స్థితిలో వున్నారు?" అని రామనాధుడు వాళ్ళను అడిగాడు.

యువకుడు ఆయనతో, "నేను కాస్త కలిగినవాణ్ణే! మీరెంత అడిగితే, అంతా యివ్వగలను," అన్నాడు.

ముసలివాడు మాత్రం మాట్లాడలేదు. అప్పుడు రామనాధుడు, యువకుడితో, "పక్క వీధిలో రామాలయం ఎదురుగా, కృష్ణమాచారి అనే మంచి వైద్యుడున్నాడు. కాని, అతను డబ్బు పుచ్చుకోకుండా వైద్యం చెయ్యడు. నువ్వెలాగూ డబ్బివ్వగల స్థితిలో వున్నావు కాబట్టి, ఆయన్ని నీ వెంట మీ గ్రామానికి తీసుకుపో. నేను, నీ వెంట వస్తే, కృష్ణమాచారి, యీ పేదవాడి ఇంటికి వెళ్ళకపోవచ్చు. మరేమీ అనుకోకు!" అంటూ ముసలివాడితో బయలుదేరాడు.

—సి. యస్. ఎ. షరీఫ్






ఇరాక్‌లోని ఒక చిన్న పట్టణంలో వున్న పాఠశాలకు, హసన్ అబ్దాలీ అనే ఉపాధ్యాయుడు కొత్తగా వచ్చాడు. అతడికి తన బోధనాశక్తిలోనూ, విద్యార్థులను క్రమశిక్షణలో వుంచడంలోనూ—తనను మించినవాడు మరి లేడన్న దురభిప్రాయం వుండేది.

విద్యార్థి ఎవడైనా ఒక నిమిషం ఆలస్యంగా వస్తే, నాలుగు పేంబెత్తం దెబ్బలు వేసేవాడు. పాఠం చెబుతున్నప్పుడు ఎవడైనా పక్కకు తల తిప్పితే పది దెబ్బలశిక్ష. ఇక ఎవడైనా తుమ్మడం అంటూ జరిగితే, మొత్తం విద్యార్థులందరినీ చేతులు కట్టుకు నిలబడమని ఆజ్ఞాపించి, వాళ్లచేత మూడుస్సార్లు, ''దేవుడు మమ్మల్ని క్షమించాలి!'' అని చెప్పించేవాడు.

క్రమశిక్షణ పేరుతో ఇంత కఠినంగా ప్రవర్తించడం మంచిది కాదని అతని మిత్రులు ఒకరిద్దరు చెప్పి చూశారు. కాని, అబ్దాలీ వాళ్ళ సలహాను లెక్క చేయక, ''మనసుకు బెత్తం దెబ్బ గుర్తు లేనిదే, విద్యార్థి బుద్ధికి పాఠం అలవడదు. ఏ ఒకడైనా తుమ్మినప్పుడు అందరూ చేతులు కట్టుకు నిలబడడం వల్ల, వాళ్ళ మధ్య ఒక ఐక్యతాభావం ఏర్పడుతుంది.'' అనేవాడు.

ఈ కొత్త ఉపాధ్యాయుడి కఠినమైన బోధనా పద్ధతులు పట్టణంలోని చాలా మంది విద్యార్థుల తల్లిదండ్రులకు ఎంతగానో నచ్చినై.

వాళ్ళు ఒకోసారి అబ్దాలీకి వినేబడేట్టు, ''ఈ కొత్త ఉపాధ్యాయుడి శిక్షణలో మన పిల్లలు, కొద్ది కాలంలోనే మహా పండితులవుతారు. పూర్వం పాఠశాలలో ఉపాధ్యాయులుగా వున్నవాళ్ళకు, పాఠాలు చెప్పడం తప్ప, పిల్లలను ఎలా

క్రమశిక్షణలో వుంచాలో తెలియదు.'' అనేవాళ్ళు.

ప్రతి సంవత్సరం ఒకసారి విద్యార్థు లంతా పట్టణపరిసరాల్లోని ఉద్యానవన ప్రాంతాలకు వినోదయాత్ర వెళ్ళి వస్తుండే వాళ్ళు. అలాగే వాళ్ళు అబ్దాలీ ముందుండి దారి తీయగా పట్టణం దాటి కొంత దూరంవెళ్ళి వినోదయాత్ర ముగించుకుని, సాయంకాలానికి ఇళ్ళకు తిరిగి వస్తున్నారు.

అప్పటికింకా ఎండవేడిమి తగ్గలేదు. విద్యార్థుల్లో కొందరు దాహం అవుతున్నట్టు అబ్దాలీకి చెప్పారు. వాళ్ళ వెంట ఒక బొక్కెన వున్నదిగాని, దానిలో తీసుకు పోయిన నీరు అయిపోయింది.

అబ్దాలీ చుట్టూ పరికించి చూసి, దాపుల ఒక బావి కనబడగానే, విద్యార్థు లతో, ''ఇదుగో, యిక్కడ బావి ఒకటి వున్నది. పక్కనే చేదతాడు కూడా పడి వున్నది. రండి, మనం బొక్కెనతో నీరు తోడి తాగుదాం,'' అంటూ వాళ్ళను బావి దగ్గరకు తీసుకుపోయాడు.

అయితే, అది పాడుపడినబావి. లోపల నీరైతే వున్నదిగాని, విరిగిపడిన రాళ్ళ కారణంగా ఎంత ప్రయత్నించినా బొక్కెన లోకి నీరు రాలేదు.

అబ్దాలీ విద్యార్థులతో, ''నేను బావిలో దిగి బొక్కెనను నీరుతో నింపుతాను. అప్పుడు దాన్ని పైకి చేదుకోండి. తరవాత తాడు సాయంతో నేను పైకి వస్తాను,''



అంటూ నడుముకు తాడు కొసను బిగించుకున్నాడు.

విద్యార్థులు అతణ్ణి బావిగిలకపై నుంచి మెల్లిగా బావిలోకి దించారు.

అబ్దాలీ బావి అడుక్కు పోయాడు. అయితే పై నుంచి లోపలికి విరిగిపడిన పెద్ద రాయి ఒకటి అక్కడ వున్న నీటికి అడ్డుగా వున్నది.

అతడు దాన్ని పక్కకు లాగి, బొక్కెనను నీటితో నింపాడు. తరవాత తను నడుముకు కట్టుకుని వున్న తాడును విప్పి, దాని కొసను బొక్కెనకు కట్టాడు. విద్యార్థులు, ఆ నీటి బొక్కెనను పైకి లాక్కున్నారు.

ఈ విధంగా అబ్దాలీ ఐదుసార్లు బొక్కెనను నీటితో నింపాడు. విద్యార్థులందరూ దాహం తీర్చుకున్నారు. ఆ పని ముగియగానే వాళ్ళు బొక్కెనకు కట్టిన తాడును విప్పి, దాన్ని బావిలోకి వదిలారు.

అబ్దాలీ తాడును నడుముకు బిగించుకున్నాడు. విద్యార్థులు అతణ్ణి జాగ్రత్తగా పైకి లాగసాగారు. అతడు బావి అంచుకు యింకా రెండు, మూడు అడుగుల దూరంలో వుండగా, వాళ్ళల్లో ఒకడు పెద్దగా తుమ్మాడు. వెంటనే మిగతా వాళ్ళతోపాటు, అబ్దాలీని పైకి లాగుతున్నవాళ్ళు కూడా చప్పున తాడు వదిలి, చేతులు కట్టుకుని, "దేవుడు మమ్మల్ని క్షమించాలి!" అంటూ అరిచారు.

అయితే, తాము చేసిన పొరబాటు వాళ్ళు గ్రహించేలోపలే, అబ్దాలీ అంత ఎత్తునుంచి, బావి అడుగుకు పడిపోయాడు. ఆ దెబ్బకు అతడి నడుం విరిగింది.

అబ్దాలీ బాధతో పెద్దగా అరవసాగాడు. విద్యార్థులు దారే పోయేవాళ్ళ సాయం కోరుతూ కేకలు పెట్టారు.

ఆ గొడవ విని కొందరు అక్కడికి వచ్చి, అబ్దాలీని అతి కష్టం మీద బావి లోంచి పైకి లాగారు.

ఈ అనుభవంతో, అబ్దాలీ ఆ తరవాత క్రమశిక్షణ పేరుతో విద్యార్థులను హింసల పాలు చెయ్యలేదు.



# అవమానం

వెంకటాపురంలో వుంటున్న భూపతి అనే ఆయన, రామాపురం వాసి అయిన వీరయ్య కొడుక్కు, తన కూతురు నివ్వాలనుకున్నాడు. వీరయ్య కుటుంబం భూపతి ఇంటికి వచ్చి, ఆయన కుమార్తెను పెళ్ళిచూపులు చూశారు. పిల్ల వాళ్ళకు నచ్చింది. వీరయ్య ఆస్తిపాస్తులు భూపతికి కూడా సంతృప్తి కలిగించాయి.

భూపతి పెళ్ళి ముహూర్తం నిశ్చయిం చేసుకోనేందుకు, పుల్లయ్య అనే స్నేహితుణ్ణి వెంటపెట్టుకుని వీరయ్య ఇంటికి వెళ్ళాడు. వీరయ్య గ్రామంలోని నలుగురైదుగురు పెద్దల్ని కూడా ఆహ్వానించాడు. కాబొయ్యే వియ్యంకులు కట్నాలూ, లాంఛనాల గురించి మాట్లాడు కుంటున్నారు. ఇంతలో వీరయ్య కూతురు సుగుణ అనే అమ్మాయి ఏడుస్తూ ఇంట్లోకి వచ్చింది. ఆమె కూడా పెళ్ళీడు కొచ్చినదే.

వీరయ్య ఏం జరిగిందని కూతుర్ని ప్రశ్నించాడు. ఆమె తండ్రితో, "నాన్నా, గుడికి వెళ్ళి వస్తూంటే, ఆ నారాయణ నా జడ పట్టుకు లాగాడు," అన్నది కళ్ళు తుడుచుకుంటూ.

"వాడొక రౌడీ వెధవ! అసలు ఒంటరిగా గుడికి ఎందుకు వెళ్ళావు?" అని కూతురు మీద కేకలు వేశాడు వీరయ్య.

"నీకెన్నిసార్లు చెప్పినా బుద్ధిలేదు. ఒంటరిగా గుడికి వెళ్ళడం ఏమిటి?" అంటూ వీరయ్య కొడుకు కూడా చెల్లెల్ని మందలించాడు.

"నేను మళ్ళీ వస్తాను, వీరయ్యగారూ!" అని ఎవరెంత చెప్పినా వినకుండా భూపతి ఇంటికి బయలుదేరాడు.

దారిలో పుల్లయ్య, భూపతిని, "హఠాత్తుగా లేచి వచ్చావెందుకు?" అని అడిగాడు.

"ఇంటి ఆడబడుచుకు అవమానం జరిగితే, ఆ తండ్రీకొడుకులు చేతగాని దద్దమ్మల్లా ఊరుకున్నారు. రేపు కోడలికి జరిగినా, అంతే కదా! అందువల్ల నా కూతుర్ని ఆ ఇంటి కోడలుగా చేయ దలచ లేదు," అన్నాడు భూపతి.

—వాణిశ్రీ



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1985 జనవరి నెల సంచికలో ప్రకటింపబడును.



Subhash Sabnis



A. Govindarajulu

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ నవంబర్ నెల 15 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: – చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### సెప్టెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: వేలెడంత పెద్దరికం

రెండవ ఫోటో: బోలెడంత దాపరికం

పంపినవారు: ఎం. వి. ఎస్. ప్రసాద్, నెల్లూరు - 524001, (ఆం. ప్ర.)

*బహుమతి మొత్తం రు. 50/–నెలాఖరులోగా పంపబడుతుంది.*

### మీకు తెలుసా? సమాధానాలు

1. సర్ ఐజాక్ న్యూటన్ 2. మూడవ రిచర్డ్; పదిహేనవ లూయిస్; నెపోలియన్ బోనపార్ట్ 3. ఫ్లారెన్స్ నైటింగేల్ 4. అలెగ్జాండర్.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 188, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.

ఒక మొటిమ వచ్చిందంటే చాలు దాంతో మరొకటి
అందుకే మీకు కావాలి ప్రత్యేక చర్యగల కొత్త, ఎక్కువ ప్రభావం గల క్లియరసిల్.

# కొత్త, ఎక్కువ ప్రభావం గల క్లియరసిల్

ఏంటీ-బేక్టీరియల్ ట్రయ్‌క్లోసిన్ గలది

## మొటిమల్ని పోగొడుతుంది దాంతో బాటే యిక వాటిని పాకకుండా చేస్తుంది



పెరిగే వయసులో మొటిమలు రావడం సహజం. మీకు యవ్వనం అంకురిస్తూన్న దశలో, అవి వచ్చి, పోతూవుంటాయి. అయితే వాటిని గురించి అసలు పట్టించుకోకపోయినా లేదా వాటిని గూర్చి తెగ బాధపడి పోయినా అవి అలా మాయమైపోవు యిక. మరి మోటుగా, గోళ్ళతో నొక్కి చిదిమి పారేస్తేనూ లాభం లేదిక, పైగా దానివల్ల జరిగేదేమిటంటే అది అంటువ్యాధై పెరిగి, పాకి, ముఖంపైన మరిన్ని మొటిమలు తయారవుతాయి దాంతో.

**ట్రయ్‌క్లోసిన్ గల కొత్త, ఎక్కువ ప్రభావంగల క్లియరసిల్, అత్యంత ప్రభావంతో ఎలా పనిచేస్తుందో చూడండిక:**

కొత్త, ఎక్కువ ప్రభావంగల క్లియరసిల్, మొటిమల్ని పోగొట్టడమే కాకుండా, వాటినిక పాకకుండా చేస్తుందిక. ఎందుకంటే, దీన్లో ప్రత్యేకమైన 'ఏంటీ-బేక్టీరియల్' ఔషధం ఉంది గనక, ట్రయ్‌క్లోసెన్ గల కొత్త, ఎక్కువ ప్రభావంగల క్లియరసిల్, మొటిమలను కలుగజేసే బేక్టీరియాను పెరగకుండా ఆపు చేస్తుంది. అంతేగాకుండా మిగతా చర్మానికి అంటువ్యాధి సోకకుండా కాపాడుతుంది. మరి అందుకే మీ మొటిమలిక పాకవు.

**కొత్త, ఎక్కువ ప్రభావంగల క్లియరసిల్‌తో అత్యుత్తమ ఫలితాలను పొందే విధానం**

మొట్టమొదటగా, మీ ముఖాన్ని కడుక్కోండి. ఆ తర్వాత మీ ముఖం అంతటిపైనా కొత్త, ఎక్కువ ప్రభావం క్లియరసిల్ రాసుకోండి. మొటిమలున్నచోట మరింత ఎక్కువగా రాసుకోండి. అత్యుత్తమ ఫలితాల కోసం, కొత్త, ఎక్కువ ప్రభావంగల క్లియరసిల్‌ని క్రమం తప్పకుండా ప్రతిరోజూ, రోజుకు రెండుసార్లు పొద్దున, ఉదయమూ, రాత్రి కూడా కొంతకాలం పాటు వాడుతూ ఉండాలి.

**ట్రయ్‌క్లోసెన్ గల కొత్త, ఎక్కువ ప్రభావంగల క్లియరసిల్‌లోని అద్వితీయమైన 3-విధాల చర్య**



మొటిమలను తెరుస్తుంది



బేక్టీరియాను ఎదుర్కొంటుంది



మొటిమలను ఆరబెడుతుంది




క్లియరసిల్ క్లెన్సింగ్ మెడికేషన్ కూడా దొరుకుతుంది.



# JOIN THE MALTOVA CLUB!

## ఎక్కువ హోదాలను, పెద్ద బహుమతులను తెలియపరచే గ్రేడ్ :



☆ ఏ 3 (అందులో రెండు ఒకటే వచ్చినప్పటికీ) గ్యాంగ్ మెంబర్ల బొమ్మలకు మాల్టోవా క్లబ్‌లో మాల్టోవా ప్రయివేట్ ర్యాంక్ మరియు బ్యాడ్జి, ఐడెంటిటీ కార్డు.

4 విభిన్న గ్యాంగ్ మెంబర్ల బొమ్మలకు-మాల్టోవా ప్రయివేట్ ర్యాంక్ మరియు ఒక ఫ్రిస్బీ.



5 విభిన్న గ్యాంగ్ మెంబర్ల బొమ్మలకు, మాల్టోవా కార్పొరల్ ర్యాంక్ మరియు ఒక క్రికెట్ బ్యాట్ లేక బ్యాడ్మింటన్ సెట్



6 విభిన్న గ్యాంగ్ మెంబర్ల బొమ్మలకు మాల్టోవా కెప్టెన్ ర్యాంక్ మరియు మావర్ స్పోర్ట్స్ సైకిల్ బియస్ఏ-ఎస్ఎల్ఆర్.

### పిల్లలకొక మహాద్భుత శుభవార్త

స్లోగన్ వ్రాయనక్కర లేదు. ప్రవేశ రుసుము లేదు. చేయవలసిందంతా ఇదే.

మీ ప్రియమైన ఆరోగ్య పానీయం మాల్టోవా 500 గ్రాముల జార్లను మూడు కొనండి. ప్రతి 500 గ్రాముల జార్ లోపల ఒక మాల్టోవా గ్యాంగ్ మెంబర్ బొమ్మ ఉంటుంది. అటువంటివి 6 బొమ్మలు, 5 పిల్లలవి, ఒకటి తమాషా ఏనుగు. ఈ బొమ్మలను కలిపితే, మాల్టోవా బొమ్మ చిత్రాలౌతాయి. మాల్టోవా గ్యాంగ్ బొమ్మలను సేకరించండి. 3 బొమ్మలతో, మాల్టోవా సభ్యత్వం లభిస్తుంది. ఎంతో ప్రత్యేకమైన ఒక బ్యాడ్జి, ఒక గుర్తింపు కార్డును దక్కించుకోండి. 3 సేకరించిన తర్వాత విరమించవద్దు. ఎంత ఎక్కువగా సేకరిస్తే అంత పెద్ద మెంబర్‌షిప్ ర్యాంక్, అంత ఎక్కువగా బహుమానాలు లభిస్తాయి.

క్లబ్బులో చేరటానికి ఆఖరి తేదీ 31 డిసెంబర్ 84
సభ్యత్వానికి, బహుమతులకి, బొమ్మల పెట్టె మీ పేరు అడ్రస్సు ఇంగ్లీషులో వ్రాసి (పెద్ద అక్షరాలలో) పంపండి.

**The Maltova Club**
Jagatjit Industries Ltd
5th floor, Bhandari House
91 Nehru Place New Delhi 110 019.




**JIL JAGATJIT INDUSTRIES LIMITED**

## విటమిన్‌లతో నిండిన మాల్టోవా: ఆరోగ్యం, బలం మరియు శక్తికోసం

SIMOES-D/JIL/CP/84/TEl




జుట్టు అద్భుతంగా ఉండేటట్టు చేసేది రీటా. దానిలో అటువంటి శక్తి, సువాసనా ఉన్నాయి - శిరోజాలు సహజంగా, చక్కగా పెరగడానికీ, నల్లదనానికీ, దానికదే సాటి.

రీటా వాడి మీ కురుల సౌభాగ్యాన్ని వృద్ధి చేసుకోండి. మీ శిరోజాలు ఏపుగా, ఒత్తుగా పెరిగి నిగనిగలాడుతూ మెత్తగా ఉంటాయి.




స్త్రీలూ పురుషులూ వాడవచ్చును

# రీటా

నేడే ఒక సీసా కొనండి
ప్రతిచోటా దొరుకును

ఇప్పుడు సూపర్ ఎకానమి (100 ml) సైజులో కూడా వస్తున్నది.